# విభూతి

సంపాదకులు

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

సారస్వత ధార్మిక మాసపత్రిక




పుంద్రము 3 | శా. ౧౮౬౪ చిత్రభాను వైశాఖము — శికింద్రాబాద్ — | రేఖ ౧౦

Vol. 3. | **25th April, 1942** | No. 10

**SECUNDERABAD**

సం॥ర చందా ౨-౮-౦

విడి సంచిక ౦-౪-౦

# విభూతి - విషయసూచిక

## చిత్రభాను - వైశాఖము




సారస్వత ధార్మిక మాసపత్రిక

| సంపుటము ౩ Vol. 3 | శా ౧౮౬౪ చిత్రభాను వైశాఖము,—సికింద్రాబాద్ 25th April 1942–Secunderabad | రేఖ ౧౦ No. 10 |
|---|---|---|

# పరిస్థితి

'విభూతి' బహుధాన్య మహాశివరాత్రిని యవతరించినది. దాదాపు ఈ ముహూర్తముననే ప్రపంచ మహా యుద్ధము జర్మనీభూమిని జన్మించినది. మరుసటి మాసమునుండియే కాగితముల ధర పెరుగ నారంభించెను. నేటికి మరియు విపరీతముగ హద్దు మీరిపోయెను. దినదినము కాగితము దుర్లభమయ్యెను. కొన్ని పత్రికలు దీర్ఘనిద్ర నందెను. 'విభూతికి' కొంత తక్కువధరలో కాగితముల నిత్తుమని శ్రీ మద్రాసు ప్రభుత్వమువారు వాగ్దానముగావించి యెన్నియో మాసములు గడచినవి. కాని ఈ మాట కర్థము మా కింకను తెలియలేదు. 'విభూతి'కి సొంత ధనముగాని, ముద్రాక్షర శాలగాని లేదు. ఐనను మూడువత్సరములనుండి ఉదారచరితు లగు మహారాజపోషక, రాజపోషక, సహాయకుల పుష్కలమైన యుపకారమువలన ఇంతదనుక సాగుచు వచ్చినది. కాని నేటి పరిస్థితి ఇంక నే విధముగ మారునో దురూహ్యము. సికింద్రాబాదు – బెజవాడలు శాంతిగ నుండిన నే విభూతి వెలువడగలదు. యుద్ధములేకున్నను యుద్ధభీతి అపుడే అలముకొనుచున్నది. వెనుకటివలె సంచరించి ప్రచారమొనర్చుటయు నిరాపదముగ లేదు. 'విభూతిని' ఆపివేయవలెనను సంకల్పము మా కే మాత్రము లేదు. పరిస్థితిని మాత్రము పాఠకులు పరిశీలించుచుండవలెను. అకస్మాత్తుగ అట్లు నిలిపివేయబడినయెడల చందాదారుల లెక్కకు సరిపోవునట్లు పుస్తకముల నందజేయగలము. ఈ విశ్రాంతిలో సంపాదకుని గ్రంథరచన మాత్రము నిరాతంకముగ సాగుచుండును. రాజపోషకు లాదిగాగలవారికిని గ్రంథబిల్వములు సమర్పితము లగుచుండును. సుభిక్షము ప్రత్యక్షమగుట తడవుగ మరల విభూతి స్వభావము నందగలదని ఇష్టములేకున్నను నివేదింపవలసివచ్చినది. పత్రిక ఇంకను ఆపబడలేదు. భవిష్యము శివాధీనము.

— సంపాదకుడు.

# అన్వేషణ

శ్రీ మంచళ్ళ సుదర్శనాచార్యులుగారు

గీ॥ ప్రళయ వాతాహత చలిత భయద వార్ధి, సదృశ మనిపించు జడునికి జగతి యనిన;
నిస్తరంగగభీరవార్నిధి పిధాన, సత్యయోగికిఁ దోచు విశ్వము సతంబు.
ఇరువు రన్వేషణార్థులై యేఁగినారు, వార్ధి గర్భమధ్యమునకు భద్రముగను-
ఘోర తిమిర నక్ర గ్రాహకూటమనెడి, భీతిఁగొని దుఃఖమున బయల్వెడలె జడుఁడు.
త్రిభువనారాధ్యుఁడా వాసుదేవునికిఁ గు,మార్తె నొసఁగి కాళ్ళు గడుగు మాన్యత లభి
యించినకతానఁ దన్నాశ్రయించు వారి,కెపుడు ముక్తిమార్గమును బోధించుననుచుఁ
బరవశుండౌచును వెడలివచ్చె యోగి.

యోగి :

ప్రత్యణువునందు శ్రీశుని భవ్యరూప, చిద్విలాస గరిమఁ గాంచి జీర్ణమెుందు
భంగురశరీరసౌఖ్యసంపదకు రోసి, ఈశ్వరార్చనకుఁ గడంగఁ దృప్తి కలుగు.
"గ్రహణ సమయ రాహుగ్రస్త కమల బాంధ, వవిగత సహజతేజ ప్రభావసరణిఁ
దోపఁ బ్రిబలారి షడ్వర్గ దుస్సహాసహ,వాస మాశింప విజ్ఞాన భాగ్య ముడుగు"
నంచు సంగపరిత్యాగ మభిలషించు.

జడుఁడు :

సంగ మాత్మత నొసఁగి విశ్వంభరుండు, పాంచభౌతిక దేహసంబంధసౌఖ్య
మనుభవింపఁగ సృష్టించె ననుచు మఱచి, అభ్యసించెద వేమి యోగాసనంబు?
దేహపుష్టిని సాధింపఁ దిరిప మెత్తి, వైనఁ గడుపార భుజియించు మానవుండు
తనువు శుష్కించు మార్గమున నడచెదవు, సర్వసంగవిసర్జన చాలు నింక,
అనుచు మూఢుఁ డైహిక సౌఖ్య మనుభవింపఁ, బలుకుచుండును విజ్ఞానభాగ్యశాలి
భూతనాథుని చరణాబ్జములనుఁ గొలిచి, పరమపదమునుఁ గాంచంగఁ బాటుపడును.



# పాలకురికి సోమనాథుఁడు

శ్రీ బండారు తమ్మయ్యగారు

ఆంధ్రదేశమునందు వీరశైవమతము, వాఙ్మయము ప్రచారమగుటకుఁ బాటుపడిన వారిలో శ్రీమతి పండిత మల్లికార్జునపండితుల తరువాతఁ బేర్కొనఁదగినవాఁడు పాలకురికి సోమనాథుఁడు. మతప్రచారమునకు జనవశీకరణమునకు వాఙ్మయము పరమసాధనమని గుర్తించి దానిని గార్యరూపమున సాధించినవారిలో నీతఁడగ్రగణ్యుఁడు. ఈతని కాలము నాఁటికి వెలసిన యాంధ్రవాఙ్మయము సంస్కృతపదభూయిష్ఠమై జనసామాన్యమున కంతగా నుపకరింపకుండెను. మూఁడుపాళ్లు సంస్కృతపదములతో గద్యపద్యాత్మకముగ సంఘటితమయిన నన్నయభట్టారకుని యాంధ్రమహాభారతమే యప్పటి యాంధ్రవాఙ్మయమునందలి యుత్కృష్టగ్రంథము. "ఉరుతర గద్య పద్యోక్తులకంటె, సరసమై పరఁగిన జాను తెనుంగు" సర్వసామాన్యమనియు, "ఆరూఢగద్య పద్యాదిప్రబంధ, పూరితసంస్కృత భూయిష్ఠరచన, మానుగా సర్వసామాన్యంబుగామి, జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు" ననియు బాగుగా గ్రహించి, తెలుంగు కవితజీవము తేనియ తేటలగు జాను తెనుఁగుఁబలుకు బడులలోనన కలదని తలంచి నన్నయభట్టారకుని మార్గమునకు వన్నియ వెట్టి జాను తెనుఁగుఁ బలుకుల జాలువార్చి దేశీయచ్ఛందమగు ద్విపదలోఁ దన ప్రధానగ్రంథముల రచించి దేశీయులహృదయములఁ జూఱగొని వారిని శైవనమొనర్చికొని తన్మూలమున వీరశైవమతప్రచారమునకుఁ బూనుకొనిన వాఁడీ మహనీయుఁడు. అల్పాక్షరముల ననల్పార్థ రచన కల్పించుటయకాదె కవి వివేకంబని చాటి తెలుఁగుమాటల వేదముల కొలఁదియకాఁ జూఁడని లోకమును హెచ్చరించి యసదృశంబగు దేశాభిమానమును మాతృభాషాభిమానమును బ్రకటించిన ధన్యమూర్తి యీ కవిచక్రవర్తి.

పాలసంద్రమున సుధాంశుఁడువోలె నీ కవిచంద్రుఁడు క్రీ॥ శ॥ 1160 ప్రాంతమునఁ బాలకురికి యను జనపదమున నుదయమందె. ఆ గ్రామము నేఁటి నిజాముమండలములో ఓరుగంటికి రమారమి పండ్రెండుక్రోసుల దూరమున నల్లగొండజిల్లా జనగామ తాలూకాలో పాలకుర్తి యను పేరితో వ్యవహరింపఁ బడుచున్నది. సోమనాథుని కాలమునాఁటికి దానికిఁ బాలకురికి యనియే వ్యవహారము. ఈ గ్రామనామమునుబట్టియే సోమనాథుని యింటి పేరు పాలకురికివా రని యేర్పడినది. ఆ గ్రామమందలి శివలింగమునకు సోమేశ్వరుడని పేరు. ఆ దేవునిబట్టియే తలిదండ్రు లీతనికి సోమనాథుఁడని నామకరణ మొనర్చియుందురు. ఈ కవివంశ్యు లిప్పటికిని నీ గ్రామమున నివసించియున్నారు. ఈ విషయముల బాగుగాఁ బరికింపక నామసామ్యమునుబట్టి మైసూరురాష్ట్రమందలి తుముకూరు తాలూకాలోని హాలకురికి యీతని జన్మస్థల మని యొక మిత్రులవిచారమూలకముగ లిఖించిరి. అది

పరిహరణీయము. ఈ కవివరుని శిష్యప్రశిష్యకోటిలోఁ జేరి యాతని కంకితముగా అన్యవాదకోలాహల మను శతకమును రచించినకవికూడ నిజాము మండలమందలి పాలకురికిని గూర్చియే "భవదీయ సంబంధ బంధురంబయ్యెనే, భాగ్యంబుచేసెనో పాలకురికి" ఇత్యాదిగాఁ దన శతకమున వ్రాసియున్నాఁడు. కావున సోమనాథునిజన్మస్థలము పూర్వోక్తమయిన పాలకురికి (నేఁటి పాలకుర్తి)యే యని నిరాఘాటముగ చెప్పవచ్చును.

ఈతఁడు సహజ వీరశైవుండగు జంగముఁడు. ఈ శాఖవారిని మఠస్థులని, మాహేశ్వరు లని నేఁడాంధ్ర దేశమున వ్యవహరించుచున్నారు. మఠస్థులని పిలువబడెడి యాజంగమ శాఖవారు వీరశైవులలోని లింగబణిజులు మున్నగు భక్తకులములవారికి గురువులుగా వ్యవహరింతురు. రేవణసిద్ధ (రేణుక), మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వారాధ్య అను కలియుగ వ్యవహారనామములు గల వీరశైవపంచాచార్యులచేఁ బ్రతిపాదింపఁబడిన వీరశైవమతమునకుఁ జెందిన భక్తమాహేశ్వరులలో మొదటినుండియు నా పంచాచార్యులకు సంబంధించిన వీర, నంది, భృంగి, వృష, స్కంద అను పంచగోత్రములే వ్యవహారమునందున్నవి. గురువులగోత్రమే శిష్యకోటికిఁగూడ సంక్రమించుట యీ మతమువారి సనాతనాచారము. ఈ పంచగోత్రాధిపతులలో మూడవవాడగు భృంగికి భృంగిరిటియనికూడ నామాంతరము గలదు. ఇందు కనుగుణముగనే సోమనాథుఁడు తాను దొలుదొలుత రచించిన అనుభవసార మను పద్యకృతిలో "భృంగిరిటిగోత్రుఁ డనుగురు, లింగతనూజుండ శివకులీనుఁడ దుర్వ్యా, సంగవివర్జితచరితుఁడ, జంగమ లింగప్రసాద సత్ప్రాణుండన్" అని తన కులగోత్ర మగు భృంగిగోత్రమును బేర్కొని తన సహజ వీరశైవత్వమును బ్రకటించికొనినాడు. దీనిని బట్టియే యీతని శిష్యప్రశిష్యకోటిలోఁ జేరిన పిడుపర్తి సోమనాథకవి యీతని కంకితముగా రచించిన పద్యబసవపురాణములో "భృంగిరిటి గోత్ర సంభవ। జంగమ పాదార్చనావిశారద వీణ। త్సంగీతశాస్త్రపారగ। గంగోత్పత్తి ప్రకార కావ్యధురీణా!" అని యీతనిని సంబోధించినాడు. భృంగి గోత్రజుల కెల్ల వీరశైవపంచాచార్యులలోఁ దృతీయాచార్యు డగు ఏకోరామాచార్యుఁడు గురువు. దీనిని బట్టియే ఏకోరామశబ్దమును బద్యమున ఛందస్సున కనుగుణముగ సరిపడునట్లు "ఏకామ్ర" అని హ్రస్వీకరణ మొనర్చి, అన్యవాదకోలాహలశతకకర్త "యాహితానుషంగ యేకామ్రగురు చిత్త, నలినభృంగ సోమనాథలింగ" అని సోమనాథుని సంబోధించుచుఁ దన శతకమునకు మకుటమును గూర్చికొనినాఁడు. పాలకురికియందును దత్ప్రాంతమందును నున్న సోమనాథుని వంశజులు నేఁడుగూడఁ దాము భృంగిగోత్రుల మనియు, ఏకోరామాచార్య పీఠమునకు సంబంధించిన వార మనియుఁ జెప్పికొనుచున్నారు. వీరశైవాగమములు సహజ వీరశైవులకుఁ బూర్వోక్తము లగు పంచగోత్రములనే చెప్పుచున్నవి. ఇట్టి గోత్రవ్యవహారము కేవల వీరశైవులలోనే తప్ప వీరశైవమతసంప్రదాయముల నవలంబించిన యారాధ్యబ్రాహ్మణులలోఁగాని, కేవలస్మార్త బ్రాహ్మణులలోఁగాని యెచ్చటను లేదు

వారిరువులలోఁగూడ గౌతమ, భారద్వాజాది ఋషిగోత్రసూత్రములే సనాతనముగ వ్యవహారమునం దున్నవి. ఇట్టిమతసాంప్రదాయముల గుర్తింపక కొందఱు వృథాదురభిమానములతో సోమనాథుఁడు స్మార్తబ్రాహ్మణుఁడో యారాధ్యబ్రాహ్మణుఁడో కాఁదగునుగాని యట్టి వేదవేదాంగాదివిశారదుఁడు మరియొక కులమునకుఁ జెందనేరఁడని వితండవాదము లొనర్చుచుఁ బరిహాసపాత్రు లగుచున్నారు. సోమనాథుఁడు నాతని శిష్యులు స్వయముగా వ్రాసినవ్రాఁతలఁబట్టి యాతని సహజ వీరశైవత్వము, జంగమ శాఖాజననము సువ్యక్తమగుచుండ సందుగూర్చి వ్యతిరేకవాదము లొనర్చుట నేల విడిచిన సాముగాఁ బరిణమింపక తప్పదు. వీరశైవ మతోద్ధారకు డగు బసవేశ్వరుని వృత్తాంతము సోమనాథునకుఁ బాగుగాఁ దెలియవచ్చి యాతని యెడ భక్తి కుదిరి క్రమముగా నది పారవశ్యములోనికిఁ బరిణతమైనప్పుడు రచించిన పండితారాధ్య చరిత్రములో "బసవని పుత్రుండ బసవ గోత్రుండ, బసవేశు శ్రీపాదపద్మ శేఖరుఁడ, ......బసవని యిలువుట్టు బానిసకొడుక" ఇత్యాదిగాఁ జెప్పికొనిన వాక్యము లన్నియు బసవేశ్వరునందు సోమనాథునకుఁ గల భక్తి పారవశ్యమునే ప్రకటించును గాని యా విశేషణములంబట్టి యీతనికి బసవేశ్వరునితో నాయా సంబంధము లుండెనని నిర్ణయించుటకు నవకాశ మొసంగఁ జాలవు. బసవేశ్వరుఁడు గోత్రకర్త కానేకాఁడు. బసవ గోత్రమనునది వీరశైవులలో నెప్పుడు వ్యవహారమున లేదు. సోమనాథుఁడు బసవేశ్వరుని పుత్రుఁడు కానట్లే యాతని గోత్రజుఁడుకూడఁ గాఁడు. అతఁడు భృంగిగోత్రజుఁ డగు జంగముఁ డగుటయే సత్యసమ్మతమయిన సిద్ధాంతము.

సోమనాథుని కాలము క్రీ॥ శ॥ 1160—1240 అని స్థూలదృష్టితో నిర్ణయింపవచ్చును. బసవపురాణావతారికలో నీతఁడు తత్పురాణకథాసూత్రములను దనకుఁ గరస్థలి సోమనాథయ్య మున్నగు పెద్దలు తెలియఁజెప్పినట్లు వాకుచ్చి గ్రంథాంతమున "ప్రస్తుతింపంగ సద్భక్తి విస్ఫురణఁ, బ్రస్తుతికెక్కిన బసవనిచరితఁ, జెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ, దప్పకుండఁగను యథాశక్తిఁజేసి" యని వ్రాసినాఁడు. ఇందుచే నతఁడు బసవేశ్వరుని స్వయముగా నెఱిఁగిన తత్సమకాలీనుఁడు కాఁడనుట వేఱ చెప్పనక్కఱలేదు. పండితారాధ్య చరిత్రలో నీతఁడు తాను బెలిదేవ వేమనారాధ్యుల మనుమని శిష్యుఁడనని చెప్పికొనినాఁడు. వేమనారాధ్యులు బసవేశ్వర మల్లికార్జున పండితుల సమకాలీనుఁడయి యా యిరువుర సత్కారముల నందినవాఁడని పండితారాధ్యచరిత్రమున వర్ణింపఁబడినది. పండితారాధ్యచరిత్రయందలి గ్రంథావసానమును బరీక్షించినచో నా గ్రంథ రచనాకాలము నాఁటికి మల్లికార్జున పండితుని పౌత్రులు జీవించి కీర్తి గౌరవములతో వెలయుచుండినట్లు కానవగును. వీనినిబట్టి సోమనాథుఁడు బెలిదేవ వేమనారాధ్యుని మనుమనికి, మల్లికార్జున పండితుని మనుమలకు సమకాలీనుఁడని తెల్లమగును. బసవేశ్వర మల్లికార్జున పండితు లిరువురుగూడ క్రీ॥ శ॥ 1170 ప్రాంతమున లింగైక్య మయిరనుట నిర్వి

వాదము. సోమనాథుఁడు నా రిరువురిలో నెవరినిగూడ స్వయముగా నెఱిఁగినట్లు నెట్టి యాధారములును లేవు. ఇఁక నాంధ్ర కర్ణాటకవులు సోమనాథునిఁగూర్చి యొనర్చిన స్తుతులను బరికించినచో నాతఁడు క్రీ॥ శ॥ 1222 నాఁటికే వారి సన్నుతులకుఁ దావలమయినట్లు కాననగును. కన్నడములో ఉద్భటకావ్యమును రచించిన సోమరాజు "సముదంచద్వృషభ స్తవామరమహీజారామనం సోమనం" (బసవ స్తవము లను కల్పవృక్షములకు నందనవనము వంటివాఁడయిన సోముని)అని యాతనిని స్తుతించినాఁడు. ఆయుద్భటకావ్యము నాతఁడు శాలివాహనశకము 1144 (క్రీ॥శ॥ 1222) సంవత్సరమున ముగించితినని చెప్పినాఁడు. సోమనాథుని యాంధ్రబసవపురాణమును గన్నడమున బరివర్తన మొనర్చి భీమకవి యా కన్నడ బసవపురాణమును క్రీ॥శ॥ 1369 సంవత్సరమున ముగించితి నని చెప్పికొనెను. ఇక నాంధ్రకవులలో క్రీ॥ శ॥ 1390 ప్రాంతమున నుండిన కొలని గణపతిదేవుఁడు తన శివయోగసారములో సోమనాథుని నాతని శిష్యుఁడగు చక్రపాణిరంగనాథుని నొక్కపద్యమునఁ జేర్చి స్తుతించినాఁడు. శ్రీనాథుఁడు క్రీ॥ శ॥ 1395 ప్రాంతముననే సోమనాథుని ద్విపద పండితారాధ్యచరిత్రమును బట్టి పద్యకావ్యమును రచించెను. ఈవిషయముల నెల్లఁ బర్యాలోచింప సోమనాథుఁడు క్రీ॥ శ॥ 1160 ప్రాంతమున జనించి, బసవేశ్వర మల్లికార్జున పండితుల నిర్యాణకాలమునాఁటికి బాలుఁడయి, బసవపురాణరచనముచేఁ గాకతీయ రుద్రదేవుని కాలమున క్రీ॥ శ॥ 1195 ప్రాంతమునాఁటికిఁ బ్రసిద్ధుఁడయి యాతని సమ్మానముల నంది, 1230 సంవత్సరప్రాంతమునఁ బండితారాధ్యచరిత్రమును రచించి యా పిమ్మట 1240 సంవత్సర సమీపమున సిద్ధినొంది యుండునన్న సంభావ్యముగా నుండును.

వీరశైవమతసంప్రదాయములో గురు, లింగ, జంగమము (చరలింగము)లకు నభేదమును బాటింతురు. దీక్షాసమయమున గురుఁడు హస్తమస్తక సంయోగమొనర్చి భౌతిక శరీరమును లింగశరీరముగ మార్చినంతనే తమకు వేఱుజన్మము కలుగునని వీరశైవుల విశ్వాసము. కావున గురుని హస్తాంబుజమునే యొక జన్మభూమిగ వారు సంభావింతురు. ఈ మర్యాద ననుసరించియే సోమనాథుఁడు తనకృతులలోఁ బలువురు భక్తులను గురుకరోదర సంజనితులుగ వర్ణించినాఁడు. పూర్వోక్తమయిన అనుభవసారపద్యములో తన్నుఁగూర్చి "గురులింగతనూజుండ"నని యాతఁడు వ్రాసికొనిన విశేషణమునందును, బసవపురాణమున "శరణగణాశ్రియ సకలస్వరూప, గురులింగవరకరోదర జనితుండ"ననియు, పండితారాధ్యచరిత్రములో "సద్గురులింగ ఘనకరుణాహస్త గర్భసంభవుఁడ"అనియుఁ జెప్పికొనిన వాక్యములందును గల భావార్థ మిదియే. కావున వాస్తవముగ సోమనాథుని తలిదండ్రులెవరో నిర్ణయించి చెప్పుట దుష్కరముగనే యున్నది. బసవపురాణమున "భ్రాజిష్ణుఁడగు విష్ణురామదేవుండు, తేజిష్ణువగు శ్రియాదేవియమ్మయును గారవింపఁగ నొప్పుగాదిలి సుతుఁడ"అని యాతఁడు వ్రాసిన దానిని బట్టి యాతని తలిదండ్రులు విష్ణురామదేవ శ్రియాదేవీ నామధేయాంచితు లని స్థూలదృష్టికి గోచరించునుగాని యది గూడ నిదమిత్థమని

చెప్ప వలనుపడదు. అవి సోమనాథుఁడు జనకసమానులుగ నెంచు నేగురుదంపతులనామము లయినఁ గావచ్చును. సోమనాథుని తలిదండ్రు లాతని బాల్యముననే చనిపోయి రనియు నప్పు డీతని సహజప్రతిభా విశేషములఁ గాంచి పాలకురికి గ్రామాధికారులుగా నుండిన కరణము కుటుంబమువా రీతని విద్యాపోషణములఁగూర్చి శ్రద్ధగొని యాదరించి రనియుఁ బాలకురికి ప్రాంతమున వాడుకలో నున్నట్లుకూడఁ దెలియుచున్నది. కాని సోమనాథుని కృతులయం దెచ్చటను సిందు కాకరము కానరాదు. ఇది వాస్తవమే యయినచోఁ బూర్వోదాహృతు లయిన విష్ణురామిదేవ శ్రియాదేవు లాకరణ కుటుంబమునకుఁ జెందిన శైవబ్రాహ్మణు లయినఁ గావచ్చును. సోమనాథుని కవితాగురువు కరస్థలము విశ్వనాథ కవీంద్రుఁ డని యాతని గ్రంథములవలన విస్పష్ట మగును. బెలిదేవ వేమనారాధ్యుని మనుమని శిష్యుడ నని యాతఁడు చెప్పికొనినాఁడు గాని యాగురునామము నాతఁడు పేర్కొనలేదు. అతఁ డీయనకు వేదవేదాంగములు నేర్పిన గురువు కాఁదగును. కట్టకూరిపోతిదేవర యను నతఁడుగూడ నతని గురులలో నొకఁడుగాఁ గాననగును. అత డెట్టి గురువో చెప్పఁజాలము. కాని దేవర యనుట మాహేశ్వర సూచకము. వడగామురామేశుని శిష్యుఁడగు చెన్నరాముఁడు, గొడగి త్రిపురారి, గొబ్బూరి సంగనామాత్యుఁడు, పాల్కురికి సూరనామాత్యుడు మున్నగువా రతనికి నెచ్చెలులు. వీరిలోఁ గడపటి మువ్వుర నీతఁడు వరుసగఁ దన యనుభవసార, బసవపురాణ, పండితారాధ్య చరితములకుఁ గథాశ్రోతలుగాఁగూడఁ గూర్చికొని తనతోపాటు వారిని గూడ సుస్థిర కీర్తిమూర్తులుగ నొనర్చినాడు. పండితారాధ్యచరిత్రమునందలి "మసలక మా చెన్నమల్లికార్జునని। బసవనామం బిడి భక్కి పెక్కువను, బసవలింగంబని ప్రణుతించువాఁడ" అను వాక్యమును బట్టి యీతనికి చెన్నమల్లికార్జునుఁ డను పుత్రుడో మిత్రుడో యుండ బసవేశ్వరునందలి భక్తి పెంపుచే నాతనికి బసవసంబంధికమైన మారుపేరు పెట్టి యా పేరుతో నాతనిని బిలుచుచుండె నేమో యనికూడ నెంచదగియున్నది. సోమనాథుని కుటుంబము, గురుమిత్ర బంధువర్గముగూర్చి యింతకంటె విశేష వివరము లాతని కృతుల వలన కానరావు.

సోమనాథుఁ డనన్యసామాన్యమగు ప్రతిభాసంపత్తి గల యొక యద్భుత వ్యక్తి. సమస్త శాస్త్రములును, విద్యలను, వేదవేదాంగాదివైదుష్యములను నాత డనతి కాలముననే యీశ్వరానుగ్రహమువలన సంపూర్ణముగ నాకళించినట్లు కానవగును. సర్వతోముఖమగు నీతని ప్రతిభాపాండిత్యముల కీతని కృతులెల్ల నాదర్శములుగ నున్నవి. ఈతని నొక యవతారపురుషునిగనే యానాఁడు నీనాఁడుకూడ జనులు సంభావించుచున్నారు. వీరశైవ మతోద్ధరణమునకయి నందీశ్వరుఁడు శివాజ్ఞచే బసవేశ్వరు డయి యవతరింపగా నాతని చరితమును లోకమున వెలయించుటకయి భృంగియే యీశ్వరాదేశమునఁ బాల్కురికి సోమనాథు డయి యవతరించె నని పిడుపర్తి సోమనాథుఁడు తన పద్యబసవపురాణ

మున వ్రాసినాఁడు. "ప్రత్యక్ష భృంగీశావతార"యనునది యీతని బిరుదములలో నొకటి. ఆదియందు భృంగిరిటియను శివానుచరుఁడయి కృతయుగమున సుకేశి యను శివభక్తుఁడయి, త్రేతాయుగమున సానందుఁడను మునివరుం డయి, ద్వాపరమునఁ బాణిని యను వ్యాకర్తయయి కలియుగమునఁ బాలకురికి సోమనాథుఁడయి యీతఁ డవతరించె నని వచించు చాటు శ్లోక మొకటి వీరశైవలోకమునఁ బారంపర్యముగ వినవచ్చుచున్నది. అప్రమేయములగు నీతనిశక్తియుక్తులను గర్ణాటాంధ్రకవు లతివేగముగ నన్నుతించియున్నారు.

సోమనాథుని వీరశైవాచార ధౌరేయత యనుపమానమయినది. చతుష్షష్టిశీలముల యాచరణ మీ మహామహునితోనే యంతరించెనని పలువురు వచింతురు. భవిసంపర్కము నీతఁ డెంతమాత్రము నొప్పెడివాఁడు కాఁడు. "భవిజన సమాదరణ సంభాషణాది సంసర్గదూరగుఁడ" ఇత్యాదిగా నాతఁడే వ్రాసికొనినాఁడు. ఈ విషయము లీతని శిష్యప్రశిష్యుఁడు పిడుపర్తి సోమనాథుఁడు మఱింత విపులముగ వివరించినాఁడు.

ఉపలబ్ధములయిన సోమనాథుని కృతులను పౌర్వాపర్యక్రమముగ నీక్రింద నుదాహరించుచున్నాను. అవి (1) అనుభవసారము, (2) సోమనాథస్తవము, (3) పంచప్రకారగద్య, (4) నమస్కారగద్య, (5) అక్షరాంకగద్య, (6) అక్షరాంకపద్యములు, (7) బసవోదాహరణయుగ్మము, (8) బసవరగడ, (9) బసవపురాణము, (10) చతుర్వేద సారము, (11) సోమనాథ భాష్యము, (12) వృషాధిప శతకము, (13) పండితారాధ్య చరిత్రము. ఇవిగాక యముద్రితములు, అనుపలబ్ధములు నగు బసవారాధ్యరగడ, బసవాష్టకము, త్రివిధలింగాష్టకము, సద్గురురగడ, గంగోత్పత్తిరగడ, రుద్రభాష్యము, మల్లమదేవీ పురాణము మున్నగుకృతు లతఁడు రచించినవి యనేకములు గలవు. ఇందులో అనుభవసారము రమారమి 300 పద్యములుగల లఘుకృతి. ఇందు గురుమహిమ, భక్తిలక్షణము మొదలగు విషయములఁగూర్చి తాను గనివినిన యనుభవముల నీతఁడు వర్ణించును. నన్నయ, తిక్కనల నడిమికాలమున నాంధ్రపద్యరచన మొందిన క్రమపరిణామమును గుర్తించువారి కీకృతి మిక్కిలి యుపకరించును. ఇది సోమనాథుని ప్రాథమిక కృతిగ గోచరించును. ఇందులో నాంధ్రశైవాచార్యుఁడగు మల్లికార్జున పండితారాధ్యుని మూఁడు పద్యములలో వర్ణించియు సోమనాథుఁడు బసవేశ్వరుని పేరయిన నెత్తలేదు. కావున బసవేశ్వరునిఁగూర్చి యంతగా విని యాతనియందు భక్తిపారవశ్యము కుదురని తొలి ప్రాయముననే యాతఁడు దీని రచించెనని తలంపనగును. తక్కిన కృతులలో బసవేశ్వరునిఁ గూర్చిన స్తోత్రములు వర్ణనలు విశేషముగఁ గాననగును. సోమనాథస్తవము పాలకురికియందలి సోమేశ్వరస్వామిపయి చెప్పిన చిన్న ద్విపద స్తవము. దీనినిగూడ సోమనాథుఁడు చిన్నతనముననే రచించినట్లు గోచరించును. సోమనాథుఁడు బసవస్తోత్రములను సంస్కృతపద భూయిష్ఠము లగు పంచప్రకారగద్య మున్నగు గద్యపద్య కృతులలో నొనర్చి యవి జనసామాన్యమున కంతగా నుపకరించి మతప్రచారమున కెక్కువగా

నుపకరింపనేరవను తలంపుతో జాను తెనుంగుపయి మక్కువ గొని తన ప్రధాన కృతులగు బసవపురాణ పండితారాధ్యచరిత్రములను మల్లమదేవ పురాణమును జాతీయచ్ఛందమగు ద్విపదలో రచించినట్లు కాననగును. ఈతని బసవపురాణ పండితారాధ్యచరిత్రము లాంధ్ర వాఙ్మయమున కమూల్యాలంకారములు. భక్తిరసపూరితము లగు కృతుల కావేశముతోఁ గూడిన యీతని రచనములే యాంధ్రవాఙ్మయమునం దాదర్శకము లయినవి. పోతన, శ్రీనాథుఁడు, ధూర్జటి మున్నగు భక్తశిఖామణుల యుత్తమ రచనములకు సోమనాథుని కావ్యములే జీవనౌషధము లనుట వేఱ చెప్పనక్కర లేదు. ఆంధ్ర వాఙ్మయమున విశేషముగ వ్యాపించిన శతకరచనమునకుఁగూడ సోమనాథుఁడే ముఖ్యకారకుఁడు, వృత్త శతకముల కీతని వృషాధిప శతకము, సీసశతకముల కీతని చతుర్వేదసార మను పేరఁ బరఁగు బసవలింగ శతకమును నాదర్శము లయి వెలసినవి. శతకవాఙ్మయమున నుపలబ్ధము లయిన కృతులలోఁ బూర్వోక్తములగు నీతని శతకములే ప్రథమమునఁ బేర్కొనఁదగినవి. గేయరచనములకుఁగూడ నీతని గద్యకృతులు, రగడలు మున్నగునవి దారి చూపిన వనుట సత్యదూరము కాదు. వేయేల ! ఈ యాచార్యవతంసుఁడు వీరశైవమత ప్రచారమునకు నాంధ్ర వాఙ్మయవికాసమునకు నయి యవలంబించిన మార్గములు బహుముఖములు. ఆంధ్రలోక మందు కీతని కెంతో ఋణపడియున్నది.

సోమనాథుఁడు కడపటివయస్సులోఁ గన్నడ దేశమున కేఁగి కలికె మను గ్రామమున సమాధి నేర్పఱిచికొని లింగైక్యమయ్యె నని తోటద సిద్ధలింగకవి, పిడుపర్తి సోమనాథుఁడు వ్రాసినారు. అట్టి గ్రామ మేదియుఁ గానవచ్చుటలేదు. పాలకురికి యందే యీతని సమాధి పయి ప్రతిష్ఠింపఁబడినట్లు చెప్పఁబడు సోమనాథలింగమే నేఁటికిని బూజలనొందుచు విశేష మహిమాన్వితమయి భక్తులకు, వ్యాధిగ్రస్తులకు యాత్రాస్థానమయి వెలయుచున్నది. *

* పా. సోమనాథుని గూర్చిన యొక ప్రత్యేకమైన గ్రంథమును ప్రకటించుట చాల ముఖ్యము. దానికి గావలసిన సామగ్రినంతయు దాదాపు శ్రీ బండారు తమ్మయ్యగారు సిద్ధపరచియే యున్నారు. ఉదార చరితు లేమహానుభావులైనను ఈ గ్రంథమును బ్రకటించి వీరశైవ మతీయులకు ఉపకార మొనర్ప గోరుచున్నాము.

—సంపాదకుడు,

---

# శ్రీ మ. సిద్ధి వీరయ్యగారి ఔదార్యము.

డాకూరు గ్రామ నివాసులును సుగుణ సంపన్నులును అగు శ్రీ మఠం సిద్ధి వీరయ్యగారు మిక్కిలి యౌదార్యమువలన “వీరశైవమహాత్ములు” అను గ్రంథమునకు సంపూర్ణముగ సహాయ మొనర్చి ధన్యులైనారు. వీరి ధర్మము ఆదర్శనీయమైనదని మా కృతజ్ఞతను వెల్లడించుచున్నాము.

—సంపాదకుడు.

# భవభూతి - ఉత్తరరామచరిత్ర

శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు,

ఈ భవభూతి మహాకవి విదర్భదేశమున పద్మాపుర మను గ్రామమున నివసించు చుండెను. ఉదుంబరీ వంశజుఁడు. కాశ్యపగోత్రుఁడు. నిత్యాగ్నిహోత్రి. అనేకశాస్త్రముల నభ్యసించినవాఁడు. జ్ఞాననిధి యను నాతనికి శిష్యుఁడు. వేదాంతమును నీతని వద్ద నభ్యసించినవాఁడు. గురువు సన్న్యాసి. ప్రథమమున శ్రీకంఠపదలాంఛితుఁడు. అనఁగా శ్రీకంఠయ్య. తరువాత భవభూతిఁడు. భవభూతి నాటకము లుజ్జయినిలో ప్రదర్శింపఁబడి నట్లు తాను చెప్పుకొనుటచే తాను పద్మపురముననుండి తన నివాసము నుజ్జయినికి మార్చుకొనినట్టుల విమర్శకవాదము. ఈతని కాలమునుగురించి విమర్శకలోక మిదివరకే విమర్శించి యున్నది. కాన నది యననసరంబు. సుమారు 736 నకు పూర్వుఁడు. 7 వ శతాబ్దియందున్న వాఁడు. ఈతని నాటకములు మూడు. మహావీరచరితము, మాలతీ మాధవము, ఉత్తర రామ చరితము. ఉత్తరరామచరిత్రమునకు మూలము శ్రీమద్రామాయణ ఉత్తరకాండ యందలి కథయందు వర్ణితము. ఉత్తర రామచరితమున "శబ్దబ్రహ్మవిదః" "పరిణత ప్రజ్ఞస్య వాణీమిమాం" అని యుండుటచే నీ నాటకము భవభూతి రచనలలో మూడవది కావలయును. ఉత్తర రామచరిత్రము సర్వాతిసుందరముగా చిత్రితము. భవభూతి మంచికవి. ప్రకృతి వర్ణనలయం దభిమానము మెండు. గంభీర ప్రకృతి యనిన నిష్టపడువాఁడు. శోకమును బాగుగ వర్ణించును. అభిప్రాయానుకూలమగు శైలి ననుసరించి కైత లల్లును. ఈ కవికి నాటకీయ శైలికన్న కావ్యశైలి బాగుగ నలవడిన దనవలయును. భావనాశక్తి మనోభావాభివ్యక్తి చాల గొప్పవి. రసవ్యంజకతను విపులీకరించువాఁడు. భవభూతి కరుణపాత్రధారులు కఠినపాషాణ ఫలకమైనను రోదించునట్లు కన్నీటిధారలు ప్రవహించునట్లు శోకింతురు. ఉత్తరరామచరితమున ద్వితీయాంకమున జనస్థానమును తృతీయాంకమున సీతారాముల పవిత్రప్రణయమును జక్కఁగ వర్ణించినాఁడు. ఉత్తరరామ చరితము శ్రవ్యకావ్యమువలె నుండును. భవభూతి గద్యరచనలయందుగూడ తనకుంగల నిశిత ప్రజ్ఞను కనబఱచువాఁడువలె దీర్ఘసమాసా లల్లినాఁడు. ఈతనికవిత్వమందుగల విలక్షణత ఉత్తరరామచరితమున విపులముగా గోచరించును. తనకంటె పూర్వికుల కవిత్వమును అధిగమించును. ఈతని భావములు భావజ్ఞుల హృదయములను రంజిల్లచేయును. ఈతనికయితయందుఁగల సుగుణసంపత్తి యనన్యసామాన్యమైనది.

ఈనాటకమునందు ప్రధానపాత్రలగు సీతారాముల స్వరూపాదులు చూచిన పాఠకులడెందముల కమితానందము చేకూర్చును. ఆ పుణ్యదంపతులు ప్రసిద్ధులు. భావిలోక కళ్యాణకారకులు. భావిప్రజలకు సర్వవిధముల ఆదర్శప్రాయులు. దేవాంశసంభూతులు. వీరల

యందు యెట్టి కళంకమును కానరాదు—ఈకవి ప్రేమ విప్రలంభమును వర్ణించుటలో సిద్ధహస్తుడు. సీతారాముల ప్రేమ పవిత్రమైనది, అవిచ్ఛిన్నము, అనుపమానము. వారి ప్రేమ లోకాదర్శముగా ప్రతిపాదితము, సీతారాముల వియోగము చాల సొంపైనది. వినుటకు కుతూహలము వొడమును. ఇతరకవులవలె వీరి వియోగమున మలయానిలచంద్రిలు మొదలగు దూషణలుకాని హృదయశాంతికయి శీతలోపచారములు కాని కానరావు. వియోగమున్ననే ప్రేమ శోభించును. ఈ సూత్రార్థమును భవభూతి బాగుగ గ్రహించిన వాడు. ఇట్టి ప్రేమ సీతారాములయందు సర్వాంగసుందరముగా ప్రతిపాదితము.

భవభూతి ప్రకృతిని చిత్రించుటలో నిశితప్రజ్ఞ కలవాడు. ఇతర కవుల ప్రకృతి చిత్రణములు, ప్రకృతి వర్ణనములతో మాత్రమే తుష్టిని పొందును. ఈతని ప్రకృతి చిత్రములు మనోభావముల కనుగుణముగా శోభిల్లును. తృతీయాంకమున కరికలభ మందలి పుత్రప్రేమ దీనికి లక్ష్యము కాగలదు. ఇట్టి స్థలము లనంతముగా నీనాటకమున గలవు. మనోభావవ్యక్తియందు తఱచు శిఖరిణీవృత్త ముపకరించునని భావుకుల యభిప్రాయము. ఈ వృత్తమే యీ నాటకమున తఱచు ప్రతిపాదితము. ఇట్టి స్థలము లనంతములుగా యున్నవి. సీతాసన్నిధియందుగల శ్రీరాముడు పలికినపల్కుల యందలి భావము అభినంద్యము.

శ్లో॥ వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా
ప్రమోహో నిద్రా వా కిము విషవిసర్పః కిము మదః
తవ స్పర్శేస్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి సమున్మీలయతిచ॥ (౧. అంకం.)

ఇందలి మనోభావము పరాకాష్ఠను వహించుచున్నయది. ఇదే భావి తృతీయాంకమున రామసన్నిధియందుగల సీతనుగురించి తమసావాక్యము చూడుడు.

శ్లో॥ తటస్థం నైరాశ్యాదపి చ కలుషం విప్రియవశా ।
ద్వియోగే దీర్ఘేఽస్మిన్ ఝటితి ఘటనాత్ స్తంభిత మివ ।
ప్రసన్నం సౌజన్యా ద్దయితకరుణై ర్గాఢకరుణం ।
ద్రవీభూతం ప్రేమ్ణా తవ హృదయ మస్మిన్ క్షణ ఇవ.

ఈ నాటకమునందలి శృంగారము పవిత్రశృంగారము. ఇందు లేశమైనను నీచత్వ ద్యోతకభావములు కానరావు. హద్దుమీరి ప్రవర్తింపలేదు.

ఈ కవి మంత్రశాస్త్రమునందును నిశితప్రజ్ఞకలవాడు. మంత్రోపదేశము పొందు వాడు యేరీతి తొలుత గురువందనము, తదుపరి మూలమంత్రధారణయు, అటుపిమ్మట పునశ్చరణ, అద్దానివలన ఫలప్రాప్తి పొందునో, అదేవిధమున ఈ కవియు క్రమానుసారముగా ప్రకృతనాటకమున నిరూపించినవాడు. ఈ యభిప్రాయమంతయు నాటకాది ప్రథమ శ్లోకము నందే కలదు.

శ్లో॥ ఇదం కవిభ్యః పూర్వేభ్యో, నమోవాకం ప్రశాస్మహే ।
వందేమహి చ తాం వాణీ, మమృతా మాత్మనః కలాం.

తొలుత పూర్వకవులకు నమస్సులు "అమృతాం పరాం వాణీం వందే" యని నుడివినాడు. ఈ మంత్రశాస్త్రసంప్రదాయములు నాటకమున ప్రధానపాత్రలగు సీతారాములచే నాచరింపచేసినవాఁడు. పవిత్రవంశసంభూతురాలు సువాసినియగు స్త్రీని శక్తిస్వరూపిణిగా భావించి యారాధించుట స్తుతించుట నమస్కరించుట మొదలగు విధులు మంత్రిశాస్త్రదీక్షాదక్షులగు వారి యాచారము. ఈ విధిని రామునిచే సీతయెడ సాధించినవాఁడు భవభూతి. ప్రథమాంకమున గర్భభరాలస యగు సీత నిద్రించుతఱి దుర్వార్తాశ్రవణముచే నరణ్యమునకు పంపనిశ్చయించిన రాముఁడు తన గృహలక్ష్మి, తన గేహశోభ, తన్ను విడచి పోవుచున్నదని ముక్తబాష్పములు కలవాడయి "సీతాయాః పాదౌ శిరసి కృత్వా దేవి! అయం పశ్చిమస్తే రామశిరసి పాదపంకజస్పర్శః" అని పలికినవాఁడు. సీత కేవలము తనకు గృహిణియనియే తలచలేదు రాముడు. మహాశక్తి స్వరూపముగా భావించినవాఁడు. తన హృదయములో సీతను మానుషస్త్రీగ భావించలేదు. తఱుచు నాటకమునందలి 'దేవి' శబ్దముచే భవభూతికిగల మంత్రిశాస్త్ర ప్రజ్ఞాభిమానములు సూచితములు. నాటకాంతమునకు సద్గురూపదేశాచరణము వలన ఫలసిద్ధి కలవాడువలె "శబ్దబ్రహ్మవిదః కవే..." యని నాఁడు. ఈ 'కలాం, పరాం' శబ్దములకుకూడ మంత్రశాస్త్రప్రసిద్ధములుగా నర్థముకలదు. కలాం శబ్దమునకు 'సాహిత్యకళ' యనియు కవి యూహ.

రాము డొనరించిన సీతాపరిత్యాగము న్యాయమే—శ్రీరాముడు ఒనరించినసీతాపరిత్యాగ ముచితమే. రాముఁడు కేవలము శ్రీరాముడు మాత్రమేకాఁడు. ప్రజారంజన సామర్థ్య మధికముగా గల మహారాజు. రాజ్యపాలన మొనరించు రాజునకు ప్రజారంజన మత్యుత్తమమగు కర్తవ్య ధర్మము. ఋష్యశృంగాశ్రమమునకుఁ జనిన బ్రహ్మర్షి వసిష్ఠుఁడు రామున కాదేశము పంపునపుడు యీ విషయమునే సూచించియున్నాఁడు.

శ్లో॥ జామాతృయజ్ఞేన వయం నిరుద్ధా
స్త్వం బాలఏవాసి నవం చ రాజ్యం
యుక్తః ప్రజానా మనురంజనే స్యా
స్తస్మా ద్యశో యత్పరమం ధనం వః. అ. ౧

ఓ రామా! నీవు బాలుఁడవు. రాజ్యము నూత్నము. నీవు ప్రజారంజన మొనర్పుము. దీనివలన నపారయశము లభించును. ఈ గురునానతి రామునకు శిరోధార్యము. ఇక్ష్వాకువంశజుల కీ పరమధర్మ ముగ్గుపాలు.

ఈ విషయముల నాలోచించిన రాముఁడు మొదటనే

శ్లో॥ స్నేహం దయాం చ సౌఖ్యం చ, యది వా జానకీమపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా. ౧ అం.

"స్నేహమును దయను సుఖమును తుదకు సీతనైనను లోకారాధనముకొఱకు విడచినచో నాకు వ్యథ కలుగదు." అని ప్రతిజ్ఞ చేసినాఁడు. ప్రజారంజనమునకునై వసిష్ఠుని యాజ్ఞను పాలించుటకునై, తన ప్రతిజ్ఞా నిర్వహణమునకై సీతాపరిత్యాగ మొనరించు రాముని కృత్యము న్యాయ్యమే యగును.

సీతాపరిత్యాగ మన్యాయ్య మనువా రున్నారు. వారి యాశయము నీ విధముగా గ్రహింపవలయును.

"సీత పరమసాధ్వి, మహాపతివ్రత, దేవయజనసంభూతురాలు, అగ్నిపరిపూత. ఇట్టి సీతను రాముడు దోషము కలదానినిగా నెంచి కేవల మొక చాకలి వచనము ప్రమాణముగా పరిత్యజించుట పాడిగాదు. సీతాచరిత్రములో దోషలేశమైన లేదని రాముఁడు తానే ప్రథమాంకమున పలికినాఁడు.

శ్లో॥ ఉత్పత్తి పరిపూతాయాః, కిమస్యాః పావనాంతరైః ।
తీర్థోదకం చ వహ్నిశ్చ, నాన్యతః శుద్ధి మర్హతః ॥
శ్లో॥ త్వయా జగన్తి పుణ్యాని, త్వయ్యపుణ్యా జనోక్తయః ।
నాథవన్తస్త్వయా లోకా, స్త్వ మనాథా విపత్స్యసే ॥

పవిత్రురాలయినను దూరదేశమున జరిగిన యగ్నిశుద్ధిని లోకము విశ్వసింపదని, సీత నింటికడ నుంచుకొన్న లోకము సహింపదని తాను పరిత్యాగ మొనర్చినట్లు రాముఁడే ప్రథమ ద్వితీయాంకములయందు సూచించినవాఁడు. నిర్దోషురా లని త్యజించుట యుక్తము కాదు. ఇంతకును మంచి విశ్వాసముతో గర్భభరాలసమై తన యంకశాయినియై యున్న సీతను విడచుట సాధుకృత్యము కాదు. అసహాయ యయిన యమాయక సీతను నేదో నెపమున రాముఁ డరణ్యమున క్రవ్యాదిగణంబున కర్పించుట యనుచితకృత్యము కాదా" యందురు.

"ఇంతియేకాక రామునకు సీతావిషయ మాత్మధర్మము. ప్రజారంజనము లోకధర్మము. లోకధర్మము కన్న నాత్మధర్మ మధికమైనది. తన యాత్మలో సీతను పరమపవిత్రురాలునిగా దలచిన రాముఁడు, దోషలేశమును దలచిన రాముఁడు తన యాత్మధర్మమునకు విరుద్ధముగా సీతను పరిత్యాగము చేయుటచే నాత్మధర్మమునకు హాని సంపాదించిన వాఁడయినాఁడు. సీతాపరిత్యాగమువలన ప్రజారంజనము కలుగవచ్చును గాని, దానివలన కలుగు లోకధర్మ మత్యల్పము. మెఱమెచ్చుల కయి వేషములు వేయుటతో నిది సమానము. అంతరంగమున నొక భావము బహిర్లోకమున నొక భావమును సూచించు రాముని కృత్యము నిందింపదగినది. ప్రధానమగు నాత్మధర్మమును విడచి వ్యర్థపు లోకప్రఖ్యాతికై యత్యల్పమగు లోకధర్మమును గ్రహించి సీతాపరిత్యాగము చేయుట సాధువు కాదు, న్యాయముకాదు, సత్యముకాదు ..." అనియు పరుషములు కలవు.

కాని సూక్ష్మదృష్టిచే నాలోచించిన రామునికృత్య మత్యుత్తమ మని నిశ్చయింప వచ్చును. రాముఁడు కేవలము తన సౌఖ్యమునే కోరువాఁడుకాఁడు. శ్రీరాముఁ డనంత ధర్మోపదేశకుఁడు. తన జీవితమునందలి చర్యలతో లోకమునకు మార్గదర్శియై ధర్మసంస్థాపనఁ జేయుచు నాదర్శపురుషుఁడు కాఁదగిన పురుషోత్తముఁడు. రాముని కృత్యము లన్నియు తత్త్వ ముపదేశించునవి కావలయును. శ్రీరామచంద్రుని యుత్తమావతారమున నిట్టి యుత్తమధర్మములకు లోటులేదు.

రాముఁడు సంసారధర్మములను సౌఖ్యములను గోరు సామాన్యులవలె చనటకాఁడు. తన సౌఖ్యమునే కోరు కుక్షింభరికాఁడు. తన ప్రతికృత్యము నాదర్శప్రాయముగాఁ జేయదలచిన మహాపూరుషుఁడు. రాముని దృష్టిలో లోకధర్మ మత్యుత్తమ మయినది. నిఖిలప్రజారూపములందు దా నిండియున్నాఁడు. ఏయొక్క జనుఁడు విపరీతమైనను దాను విపర్యస్తమైనట్లే తలచును. రామునకు నానారూపములనున్న లోకధర్మమే తన యాత్మధర్మము. ఆతనికి లోకారాధనమే యాత్మారాధనము. ఆతనికి వంశ సాంప్రదాయము గూడ నీ విధముగనేయున్నది. ఇక్ష్వాకువంశీయు లందఱు నిట్టి లోకారాధనముననే మహాయశస్సును గడించినారు. మహానిపుణమతి యగు రాముఁడు ధర్మసంస్థాపనమునకు సీతాపరిత్యాగము చేయుటలో దోషము లేదు. రాముఁ డిట్లు చేయకున్న లోకు లందఱు రాము ననుసరింతురు. "యథారాజా-తథాప్రజాః॥ అట్లే యయిన ధర్మము క్షీణమగును. రామునకు గౌరవ ముండదు. ధర్మమునకు బల ముండదు. లోకమునకు పుణ్య ముండదు.

శ్రీరాముఁడు సీతను పతివ్రతగనే తలచవచ్చును. సీత పరిపూతయనియే యనుకొనవచ్చును. ఆమె దుర్భరగర్భఖిన్నయే యగుగాక! సీత తన ప్రియురాలుగాదా? యని యామెయొక్కతెకై ధర్మమునకు హాని కలుగజేయరాదు. అనేకప్రజల యభిప్రాయమునకు ధర్మమునకు భిన్నముగా నాచరించురాజు రాజుగా నుండదగఁడు. అనంతమగు లోకమునకు శాశ్వతమగు ధర్మమునకు యబలను పరిత్యజించుట సాధుకృత్యము కాకపోదు. దశరథుఁడు ప్రతిజ్ఞాపూరణమునకై ప్రాణములనే విడచినాఁడని రాముఁడే పలికినాఁడు.

శ్లో॥ సతాం కేనాపి కార్యేణ, లోకస్యారాధనం మతం ।
తత్పూరితం హి తా తేన, మాం చ ప్రాణాంశ్చ ముంచతా॥

తాను తన యొక్కని సుఖమున కయి యొక్క యబలను నిఖిలలోకమునకు విరుద్ధముగా పరిత్యజింపక తన యొద్దనే యుంచుకొనునేని యపవాదకు పాత్రుఁ డగును. ధర్మస్వరూపుఁడు రాముఁడు, ధర్మమునకు సీతను పరిత్యజించినాఁడన్న దోష మేమియు లేదు. ఇది యత్యుత్తమము, సాధుకృత్యము. న్యాయము. సత్యము, ఇం దతిశయోక్తి లేదు. ముఁడు కేవలము న్యాయస్వరూపుఁడే యనవలయును.

---




భగవద్గీతా - శాంకరభాష్య తత్త్వబోధిని:—కర్త: న్యాయవేదాంత పారీణులు బులుసు అప్పన్న శాస్త్రిగారు, ప్రకాశకులు - శారదా గ్రంథమాల, భట్నవిల్లి, అమలాపురం తాలూకా, తూర్పు గోదావరి జిల్లా. "విభూతి"సైజు. పుటలు 200, గ్లేజు కాగితములు, అచ్చుమంచిది, వెల 2-0-0. నేటికిని పండితలోకము పర్యాలోచన నొనర్చి వివరింపవలసిన యంశము లెంకను గీతాంబుధిలో గలవు. దీనికి దార్కాణమే శ్రీశాస్త్రి గారి తాత్పర్యబోధిని. భగవద్గీతకు వివిధ సంప్రదాయ ప్రవర్తకులు శతాధిక వ్యాఖ్యలను విరచించినారు. అందు శాంకర సంప్రదాయ ప్రాధాన్య మెంతేని కలదు. శ్రీ శంకరుల గీతాభాష్యము మీదను పెక్కు సంస్కృతవ్యాఖ్యలు కలవు. అదియొక సముద్రము. సంస్కృతవిద్వాంసులే సరిగ నవలోకింపరు. ఆంధ్ర భాషాభిజ్ఞుల యక్కర నడుగబనిలేదు. ఈ గ్రంథముతో ఆంధ్రులకు గావలసిన యొక గొప్ప కృతి లభించుచున్నది. ఇందు గీతామూలము, పదవిభాగము, ప్రతిపదార్థము, శాంకర భాష్యానువాదమును సరళమైన తెనుగులో వ్రాయుటయేకాక మధుసూదన - శంకరానంద - సదానంద - శ్రీధర - నీలకంఠులు మున్నగు పండితశ్రేష్ఠుల టీకలలోనుండియు విశేషములను వివరించి యనేకాక్షేపములకు సమాధానముల నిచ్చియున్నారు. కావుననే ఇది భాష్యతత్త్వబోధిని. విపులమగు నుపోద్ఘాతమున చక్కని సంప్రదాయోద్బోధను ప్రతిష్ఠించినారు. గీతాద్వైత సంప్రదాయము నెఱుగగోరువారి కిది యవశ్య పఠనీయము. వేదాంత జిజ్ఞాసువులకును, ఆంధ్రులకును ఇది మిక్కిలి యుపయుక్తమైనదని వేర జెప్పనవసరములేదు. ఈ ప్రథమ భాగమున రెండధ్యాయములు మాత్రము కలవు. అచ్చు పొరపాటులు చాల స్వల్పముగ నున్నవి. విద్వద్వరేణ్యులైన శ్రీ అ. శాస్త్రిగారి పరిశ్రమ సఫలమై, వన్నె కెక్కుటలో నాశ్చర్యములేదు. ఇట్టి సుకృతమునకు బూనిన శాస్త్రిగా రభినంద్యులు.

మహాభారత చరిత్రము:—కర్త: పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కౌండిన్య నిలయము, పిఠాపురము, తూర్పు గోదావరిజిల్లా, రఫ్ డెమ్మి 380 పుటలు, వెల 1-12-0. విమర్శకులని పేర్వడసిన శాస్త్రిగారి పొత్తమునుగూర్చి విశేషముగ వివరింప బనిలేదు. ఆంధ్రులలో ననేకులు ఈలోపుగ దీనిని జదివియే యుందురు. కౌరవ పాండవులను గూర్చియు, మహాభారత కథను గూర్చియు సహజముగ సనాతన మునుండియు గొన్ని యభిప్రాయములు కలవు. ఈపుస్తకము జదువుచో చిరకాలవిశ్వాసములు కొన్ని విలయమునంది, కొన్ని తారుమారై, కొన్ని క్రొత్తగ బుట్టగలవు. చిన్న బాంబువంటిదీ పొత్తమనిన నతిశయోక్తి కాదు. దీని వలన గలుగు గొప్ప యుపకార మొకటి కలదు. దీని పరిశీలింపదలచువా రందరును అప్రమత్తులై సంస్కృత మహాభారతమును అధ్యసింపక తప్పదు. విమర్శామార్గము గూడ నవగతము కాగలదు. శాస్త్రి గారు మిక్కిలి మేధతో పరిశ్రమించి ఈ పొత్తమును విరచించినా రనుటలో సందియములేదు. భాషకు నిట్టి పొత్తములును పెక్కులు గావలయు. హిందీ వంగ మరాఠీభాషలలో నిట్టి వెన్ని పొత్తములో గలవు. ఇట్టి విమర్శాగ్రంథరచన యైనపిదప శాస్త్రిగారికి బహుమానమునకు బదులుగా ధర్మయుద్ధమునకు దిగవలసి వచ్చినది. ఐనను భీతినందక సత్యదృష్టియే వలసియున్నది. కావున నింకను ఇట్టి వాఙ్మయమును సృజించుచు శాస్త్రిగారు ప్రశస్తినందుచునే యున్నారు. ఈ గ్రంథప్రచారము నభిలషింతుము.

ఒక మాట! ప్రమాణబద్ధమైన సంగతులను ప్రకటించుటలో సంకోచ మవసరము లేదు. కాని పట్టుదల యూహ, పరవాదమునందలి అశ్రద్ధలు మాత్రము విమర్శకునకు పనికిరావు. ఉదాహరణార్థము ధర్మరాజు సన్యాసివేషమున జూదమాడె ననుకొందము. దీని వలన నా కాలపు సన్న్యాసు లందరును జూదగాండ్రను టయా? ధర్మరాజు మాత్రమే తన పూర్వాశ్రమ వాసనతో సన్న్యాసమును లెక్కింపక జూదరియయ్యె నందమా? లేక ఇది కపటసన్న్యాసము కావున ఉదరపోషణార్థమై యొనర్చె ననుకొందమా? ద్రౌపదికి నైదుగురు పతులు కావున నప్పటి యాదువా రందరికిని మగ లేవురని నిర్ణయించుటయేనా? నేటి గాంధీ మహాత్ముని రాజగోపాలాచార్యుల వియ్యముతో విదేశీయు డొకడు భారతవర్షమున బ్రాహ్మణకన్యల బ్రాహ్మణేతరులకు దాన మొనర్చు పద్ధతి నేడు మిక్కిలిగా నున్న దని వ్రాసినచో సత్యము కాగలదా? వ్యక్తులగాథలు అనేక కారణములవలన వ్యక్తిగతమైన చరిత్రను మాత్రమే తెల్పును గాని సర్వసమ్మతమైన యుగచరిత్రను జెప్పజాలవు. ధర్మసూత్రములు, మన్వాది గ్రంథములే యుగధర్మములను జెప్పగలవు. కావున విమర్శకుని చరిత్రరచన కత్తిమీది సామువంటి దని మనవి.

రామోపాఖ్యానము: తద్విమర్శనము:—క్రౌన్ సైజు, పుటలు 230, గ్లేజు, వెల 1-4-0 దీనికిని ఈ దిగువ వివరింపబడిన మూడుగ్రంథములకును శ్రీ పెండ్యాల వేం. సు. శాస్త్రిగారే కర్తలు, ప్రకాశకులును. ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి విరచితమగు రామోపాఖ్యానము ఇందు సహజముగ బ్రకటింపబడినను శాస్త్రి గారి విమర్శనభాగమే మిక్కిలి పెద్దది, కావున నిది విమృష్టరామోపాఖ్యాన మనబడును. రామచరిత్ర విశేషములు, ఆంధ్రులు, ఆంధ్రభాష, కవిత్రయము, అను విషయములను ఘనమైన పరిశ్రమతో ౧౪౦ పుటలలో వివరించినారు. శాస్త్రిగారి చారిత్రిక వైజ్ఞానిక వైదుష్యమున కిది నిదర్శన మనవచ్చును. ఆంధ్రు లాదరించి పఠింపదగిన గ్రంథము.

భవభూతి "రామాయణ"మున నధ్యాయము లున్న వనుటను, దయానందుడు 'లింగపురాణ'ము పదవ శతాబ్దమున బుట్టెననుటను, నమ్మనక్కరలేదు. ఇవి వట్టి పొల్లుమాటలు. ప్రాచీనుడైన కాళిదాసుడు రామాయణము ననుకరించియే తనకావ్యమున సర్గ లనెను. జైన రామాయణముననుసర్గలు కలవు. పదవ శతాబ్దముకంటె ప్రాచీనమగు బ్రహ్మసూత్ర దూర్వాసవృత్తియందును, పదునొకొండవ శతాబ్దపు శ్రీకరభాష్యమునను లింగపురాణప్రమాణము లుద్ధరింపబడినవి, "పురాణ దిగ్దర్శనా"దుల నవలోకింపవలెను. చర్చింపకయే ఇట్టివానిని విశ్వసించుట పొరపాటు.

నవకథామంజరి:— పుటలు 190. వెల 1-0-0, ఇందు శునశ్శేఫుడు, రుద్రమ, ఆపస్తంబుడు, వరరుచి, కుమారిలుడు, ఖంజరీ ఫకీరు, త్యాగరాజు, వీరవేంకటపతిరాయలు, శ్రీ గిరిమల్లికార్జునుడు, అను వ్యక్తులను గూర్చిన కథలై యున్నవి. ఇందలి వరరుచి కథను దొలగించి, దీనిని చిన్న "ఆంధ్రస్మృతి" యనవచ్చును. ఆ యా ప్రసంగములకు జెందిన చారిత్రిక విమర్శనాంశములును గలవు. ఇది విద్యార్థులకు బఠనీయము గావింప దగియున్నది, ఇందు శాస్త్రిగారి సఫలమైన పరిశ్రమ కలదు.

త్రిలింగశబ్దము నిస్సందిగ్ధముగ పదునొకండవ శతాబ్దముకంటె బ్రాచీనమగు నట్టియు, వీరశైవ వాఙ్మయమున ప్రసిద్ధమైనట్టియు "సిద్ధాంతశిఖామణి" గ్రంథమున ప్రయుక్తమైనది. అదివరకే వ్యాప్తమైన వీరశైవమతమున బసవేశ్వరుడు ప్రవేశించినాడే కాని పుట్టించలేదు. లేదని గట్టిగా దెలియవలెను.

పరీక్షిత్తు:— పుటలు 126, వెల 0-12-0. ఇందు పరీక్షిన్మహారాజు చరిత్రము మనోహరమైన వచనముతో వ్రాయబడినది. శుష్కమైన విమర్శనములనే కాక సరసమైన గద్య ప్రబంధములను. గూడ శ్రీ శాస్త్రిగారు సృజింప సమర్థు లనుట కిది సాక్ష్యము. ఇది యుపయుక్తముగ నుండుట వలననే ఆంధ్రము గల యన్ని విశ్వవిద్యాలయములలో పాఠ్యమై విశేషప్రచారము నందినది.

రాజసూయము!—పుటలు ౧౩౦. రఫ్. వెల 1-0-0. ఇందు వైదిక రాజసూయయాగమును గూర్చిన వివిధవిషయములు మిక్కిలి యోర్పుతో, పరిశ్రమతో కూర్పబడినవి. నర పశుయాగమైన నీ కృత్యమును బాహాటముగ విమర్శించినారు. బలమైనగుండె లేనివారికి పవిత్రమైన వేదమున. పురుషహత్యయా యని ఒక్కుమ్మడి ఒళ్ళు జలదరింపక మానదు. కాని వేద మనగా లోకవిజ్ఞానమని తెలిసినవారికి చలనముతో బనిలేదు- వంగదేశ విద్వాంసు డొకడు 'క్రతుమీమాంస' యను గ్రంథమునను, జయపుర - మహామహోపాధ్యాయ. మధుసూదన పండితాఖండలుని శతపథముపైని నిబద్ధమైన విజ్ఞానభాష్యమునను ఇట్టి కామ్యయాగ రహస్యములు భారతీయుల సంప్రదాయానుసారము అద్భుతముగ దెలుపబడినవి.

మొత్తముమీద పెండ్యాల పండితవర్యుల గ్రంథము లన్నియు ఉక్కుముక్కలు. ఆంధ్ర విమర్శా యుగాంతరద్యోతకములు, బుద్ధిగల వా రందరికి సాత్యములు. వారి సునిశితమైన ప్రజ్ఞాపరిశ్రమ లమూల్యము లనుటలో సందియములేదు. ప్రమాదములు లేవని గాని, అన్నియు సిద్ధాంతములనిగాని చెప్పము గాని, వారి సందిగ్ధ సమాచారముల సమీక్షకైనను భారతీయ సాహిత్యసాగరమును మథించిన విద్వద్వరుడు కావలెను. వృద్ధాప్యమునను ఆంధ్రవాణీ జననికి గ్రంథపాయసము నర్పించి తర్పించుచున్న శ్రీ శాస్త్రిగారు సర్వథా అభినంద్యులు.

బమ్మెరపోతనః— కర్త: కవితావిశారద! పంతము ఆంజనేయ కవిగారు, ప్రకాశకులు, ఆణాగ్రంథమాల, హైదరాబాదు, కాగితములు స్వదేశ్యములు, కద్దరువలె ముతకగా నున్నవి. పుటలు ౪౨. ఇందు భాగవత కర్తయగు పోతన కవీశ్వరుని జీవిత ఘట్టములు సంక్షిప్తముగ వివరింప బడినవి. సర్వజనుల పఠన కుపయుక్తమైనవి. భాషాదోషములును, ముద్రణాదోషములును మిగుల దొరలినవి.

సుభాషచంద్రబోస్:— కర్త: కె. రంగదాసుగారు, ప్రకాశకులు, పై వారే - ఇందు భారతీయ నవ యువకులలో నగ్రపూజ నంది, రాజకీయ నేతగాను, భవిష్యద్భాగ్యవిధాతగాను పరగణింప బడుచున్న బసుగారి జననాదు లిందు సంక్షిప్తముగ జిత్రింపబడినవి. త్యాగశీలుడైన బసుగారి వికటమైన ప్లానులు గూడ ప్రసిద్ధమే! ప్రస్తుత మీ వీరు దేశఖండమున గలడో బంధువులకే తెలియదు.

The education muddle in Hyderabad :— కర్త; ఒక విద్యాభిమాని, ప్రకాశకులు, ఆంధ్రపబ్లిషింగు కంపెనీ, సుల్తాను బజారు, హైదరాబాదు. పుటలు ౫౦, రఫ్, వెల 0-4-0. ఇందు హైదరాబాదు విద్యా ప్రచార పద్ధతి విమర్శింపబడినది. చిన్న చిన్న పాఠశాల మొదలు ఉస్మానియా యునివర్సిటీ వరకుగల బోధనాపద్ధతి యెంత నిరుపయోగమైనదో, ఆంధ్రకర్ణాటక మహారాష్ట్ర భాష లిక్కడి మాతృభాషలైనను, ఎట్లు నిరాకరింపబడినవో, సోదాహరణముగ నిరూపింపబడినవి. చివర పత్రికాభిప్రాయములు కూడ చేర్పబడినవి. ఇట్టి పుస్తక మన్ని భాషలలోను, దేశ మంతటను ప్రచారము కావలెను. అపు డైనను ఈ యార్త నాదము దయగల మన ప్రభుత్వమువారికి వినబడక మానదు.

వీరశైవబోధిని:—సంపాదకులు: బి. రామలింగయ్యగారు. ప్రకాశకులు: నెల్లూరుజిల్లా వీరశైవ సంఘము, నెల్లూరు. పుటలు 8, సంవత్సరచందా 3-0-0. ఇది మాసపత్రిక, మొదటి రెండుసంచికలు మాకు చేరినవి. అభిమానముతో, ఉత్సాహముతో నడుపబడుచున్నది. మేమీ పత్రికాభివృద్ధిని మిక్కిలిగా కోరుచున్నాము. సంఘసోదరు లాదరింతురుగాక! చందా యెక్కువగా నున్నది. అటులే సరిజేయవలసిన విషయములు చాలగలవు. ముమ్ముందు సమర్థముగా ప్రకటింపబడునని యాశించుచున్నాము.

శ్రీ:—కర్త: జమ్ములమడక మాధవరామశర్మగారు, సంస్కృత కళాశాలోపాధ్యాయులు. ప్రకాశకులు, వాసవీకన్యకాపరమేశ్వరీ దేవస్థానము, తెనాలి. పుటలు ౧౧౧, అచ్చుకాగితములు మంచివి వెల 0-4-0. ఆంధ్రభాష కొక చిన్ని నూత్నాభరణము. శ్రీ విద్యావిశారదులును, శ్రీ దేవీ పరతంత్రులును అగు శ్రీపతి (మాధవ) శర్మగారి ప్రతిభ ఈ చక్కని పొత్తమునకు అసమవాయి కారణము. సమవాయికారణ మన్ననో పెక్కు శాక్తాగమ తంత్ర గ్రంథములు, శ్రీవిద్యాస్వరూపము, ఉత్పత్తి వికాసములు, యోగ్యతా నిర్ణయము,

మహత్త్వము, దీక్షాక్రియావిధులు, గురుశిష్యస్వరూపము మున్నగు ననేకవిషయములు ఈ యల్పకాయ గ్రంథమున వివరింపబడినవి. శ్రీ చరణోపాసకుల కిది ప్రబోధ ఘంటిక యనదగును. శ్రీ శర్మగారి యపూర్వ రచన కభినందింపనివా రుండరు. తెలుగున నిట్టి పొత్తములు లేవు.

వామాచారములోని మూర్ఖత్వమును విమర్శించినారు. మాకును ఇది యభీష్టమె. కాని యన్నిటిని అర్థవాదములని త్రోసివేయలేము. వామాచారశబ్దము దుర్గాచారశబ్దమునకు తమ్ముడు. శైలి కఠినముగా నున్నది. హిందీశైల్యనుకరణమువలె కొన్నియెడల గన్పట్టును. ప్రతి పుటలోనుండు "మాధవ" శబ్దము పఠన కడ్డము దగులుచున్నది. శ్రీ శర్మగారి "తత్త్వసంగ్రహము" దీక్షాప్రకాశ - పురశ్చరణార్ణవ - శక్త్యంక - మంత్రమహోదధి గ్రంథముల సారమై తెలుగుతల్లికి అమూల్యాభరణము కావలెనని యభిలషింతుము.

విజ్ఞాననికేతన—నివేదిక:— ఖమ్మంమెట్టులో నీ పేరుతో ప్రజాసేవ గావించుచున్న సంస్థయొక్క ఐదవ వార్షిక నివేదిక నాదరముతో స్వీకరించితిమి. నిజాంరాష్ట్రమున తమకర్తవ్యమును సరిగ నిర్వహించు ౩, ౪, సంస్థలలో నిది యొకటని సాభిమానముగ జెప్పవచ్చును. పాలకవర్గమువారి యొక్కయు విశేషముగ అధ్యక్ష కార్యదర్శులయొక్కయు ప్రయత్నవిశేషములు మిక్కిలి ప్రశంసాపాత్రములని నివేదికలను క్రమముగా నవలోకించు వారికి విదితము. గ్రామస్థు లెలకో కొంత వెనుకంజ వేయుచున్నారు. ఉదారచరితులతో భరితమైన ఖమ్మంమెట్టులోని ప్రముఖుల యండవలన మిక్కిలి త్వరగా విజ్ఞాననికేతమునకు సొంత నికేతన మేర్పడి సుస్థిరమై ప్రజాసేవ నిరాతంకముగా నెరవేరవలెనని యాశించుచున్నాము.

# శ్రీకరభాష్యం

## వెలువడినది! ౧౪౦ పుటలు, ౫ చిత్రములు. వెల రు. ౦-౧౨-౦ మాత్రమే!

శ్రీకరభాష్యం (చతుస్సూత్రి) మూల సంస్కృతగ్రంథము. ఆంధ్రాక్షరములలో ఇదివరకు 'విభూతి' లో ప్రకటించుచుంటిమి. ప్రస్తుతము ఆభాగమును సంస్కృతపీఠిక, విషయానుక్రమణిక, శిలాశాసనాది చిత్రములు మున్నగు ననేకభాగములు చేర్చి చక్కగ బైండు చేయించియున్నాము. మతమునకు భాష్య మనగా నెంత ముఖ్యగ్రంథమో మేము చెప్పనవసరము లేదు. ఇది జగద్విఖ్యాతమైన గ్రంథము. ఇది పరవాదిగజాంకుశము. ఇందు వీరశైవమత వైదికత్వము, శివాధిక్యము, శివాగమప్రామాణ్యము, శక్తివిశిష్టాద్వైత నిర్ణయము మున్నగు ననేకవిషయములు మిక్కిలిసమర్థములైన యుక్తులతో వేదాగమ పురాణేతిహాసప్రమాణములతో దృఢముగ అభేద్యముగ సిద్ధాంతింపబడియున్నవి. సంస్కృతము వచ్చినను రాకున్నను ప్రతిమతాభిమాని యొద్దను తప్పక యుండదగిన గ్రంథము. ఏమతీయ పండితునకైనను దీనిని జూపి స్వమత సిద్ధాంతముల నిరూపించవచ్చును. ఇట్టి చక్కనిగ్రంథము వెల రు. ౦-౧౨-౦ లు, పోస్టుఖర్చులు ఒక్కొక్క ప్రతికి తొమ్మిది అణాలు (నిజాంలో ఏడణాలు) అగును కావున నాల్గురూపాయలు మొదలే మనియార్డరు ద్వారా పంపువారికి ఐదు ప్రతులను రిజిష్టరుద్వారా రవానింపగలము. ప్రతులు కొలదిగా కలవు. త్వరపడవలెను.

మేనేజరు "విభూతి" సికింద్రాబాదు - ద.

తెనుగు కవితలో దేశికవిత మార్గకవిత అను రెండుపద్ధతులు నన్నయ కాలమునాడే యుండినట్లు వినవచ్చుచున్నది. నన్నెచోడుడు తన కుమారసంభవములో నిట్లు వ్రాసెను.

మును మార్గకవిత లోకం,బున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రివిషయం,బున జన జాళుక్యరాజు మొదలుగ పలువుర్.
......ఉత్తమమార్గ సత్కవీ,శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిజేసి మనోముదంబునన్.

ప్రథమాశ్వాసం ౨౩ - ౨౪

రామాయణములో నిరూపించిన మార్గవిధానము సంస్కృత భాషాగానమని అర్థమగుచున్నది. దేశిపద్ధతిపైన నుండు గానములు ప్రతిమండలములోను ఉండినట్టి ప్రాకృత భాషాగానములై యుండును.

## రామాయణ రచనాకాలము

వాల్మీకి రామునిసమకాలికు డగుటచేత రామాయణ మదేకాలములో అనగా క్రీ. పూ. ౨౫౦౦ ప్రాంతములో విరచితమైనదనవలెను. కాని రామాయణములో కొన్ని నిదర్శనములనుబట్టి అట్లనుటకు వీలులేదు. రామాయణము రెండు మూడు దినాలలో తంబానకథవలె గానముచేయుటకై ఆదిలో వ్రాయబడియుండును. రామాయణము (నాల్గవ సర్గలో ౮-౯-౧౦-౧౧ శ్లోకాల)లోని మూర్ఛన, బింబము, ప్రమాణత్రయము, జాతిసప్తకము, లయ, తంత్రీ అను శబ్దాలనుబట్టి రామాయణము పాటగా పాడబడుచుండెను. అట్టి దానిని తర్వాతివారు పెంచుచూవచ్చినట్లు కనబడుచున్నది.

## ప్ర క్షి ప్త ము లు

బాలకాండలోని నాల్గవసర్గలో

"చతుర్వింశ త్సహస్రాణి శ్లోకానా ముక్తవాన్ ఋషిః
తథా సర్గశతాన్ పంచ షట్కాండాని తథో త్తరం."

౫౦౦ సర్గలు, ౬ కాండలు, పైగా ఒక ఉత్తరకాండ వ్రాయబడెననియు, ౫౦౦ సర్గలలో ౨౪,౦౦౦ శ్లోకా లుండెననియు పై శ్లోకములో చెప్పినారు. కాని యిప్పుడు ముద్రితమైన రామాయణములో ౬ కాండలలో ౫౩౭ సర్గ లున్నవి. ఉత్తరకాండలో ౧౧౧ సర్గ లున్నవి. అవికూడా కలిపితే ౬౪౮ సర్గ లగును. ఇక శ్లోకాలసంఖ్య యెట్టిదనగా యుద్ధ కాండములో ౧౧౨వ సర్గాంతములోని—

"మరణాన్తాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్"

అను పంక్తిలో "నః" గాయత్రి యొక్క ౧౯ వ అక్షరము. అందుచేత అక్కడికి ౧౯,౦౦౦ శ్లోకాలు పరిపూర్తి అయినవి. అటు తర్వాత యుద్ధకాండములోని శ్లోకాలు ౮౩౧ కావున యుద్ధకాండాంతముతో ౧౯,౮౩౦ శ్లోకాలగును. ౨౪,౦౦౦ శ్లోకాల సంఖ్య పూర్తి చేసికొనుటకుగాను ఉత్తరకాండనుగూడ చేర్చుకోవలెను. ఉత్తరకాండలో ౩౪౫౬ శ్లోకాలున్నవి. ఈవిధముగా ౭ కాండలలో ౨౩,౨౮౮ శ్లోకా లున్నవి. అనగాఅప్పటికిన్నీ

౨౪,౦౦౦ సంఖ్య పూర్తికాలేదు. కొన్ని ప్రక్షిప్త భాగాలని వ్యాఖ్యాతలే వ్యాఖ్యానించిన వారు కారు. ఉత్తరకాండను గోవిందరాజు మహేశ్వరతీర్థాదులు వ్యాఖ్యానించనేలేదు. ఎటుచూచినను సర్గభేదాలు శ్లోకభేదాలు కనపడుచునే యున్నవి. రామాయణములో కొన్ని ఘట్టాలను తర్వాతివారు చేర్చినారు. రాముని విష్ణ్వవతారముగా వర్ణించు భాగాలన్నియు తర్వాత చేర్చబడినవే.

ఇందుని ప్రాబల్యము తక్కువై శ్రీకృష్ణుని కాలములో విష్ణుదేవునిపూజ ప్రాధాన్యత వహించెను. కృష్ణుని యనంతరము దశావతార సిద్ధాంతము కల్పితమయ్యెను. ఇంకను ఏవేవి దశావతారాలో స్పష్టపడలేదు. అందుచేత వివిధపురాణాలలో వివిధ పద్ధతులపై వ్రాయుచు వచ్చిరి.

"మత్స్యః కూర్మో వరాహశ్చ నృసింహో వామనస్తథా
భార్గవో రాఘవః కృష్ణః బుద్ధః కల్కిరేవచ."

ఈ శ్లోకము మహాభారతము ౧-౨-౩౮౮-౨ అనుచోట ఉన్నదని జ. మో. చటర్జీ గారు పృశ్నిగాథా పీఠికలో వ్రాసిరి. అది యందు కానరాలేదు. పైగా ఈ క్రింది శ్లోకము మాత్రము మహాభారతమందు కనబడుచున్నది.

హంసః కూర్మశ్చ మత్స్యశ్చ ప్రాదుర్భావా ద్విజోత్తమ
వారాహో నరసింహశ్చ వామనో రామ ఏవచ
రామో దాశరథిశ్చైవ సాత్వతః కల్కిరేవచ."

మహాభారతం—శాంతి 33౯-౧౦౦

ఇందు బుద్ధునిపేరు లేదు. రాబోవు కల్కిపే రున్నది. సాత్వతుడనగా బలరాముడా కృష్ణుడా అను సంశయానికి తావులేకుండా పైభాగమందు శిశుపాల కంసాదులవధ చేయుదు నన్నందున కృష్ణుడే యని స్పష్టమగుచున్నది. ఈ యవతారపట్టికలో హంసావతార మెక్కుడుగా ఉన్నది. వామనపూజలో ఈ క్రిందిశ్లోము కనబడుచున్నది.

మత్స్యం కూర్మంచ వారాహం నారసింహంచ వామనం
రామం రామం రామకృష్ణం బౌద్ధం కల్కిం నమామ్యహం.

ఇచ్చట ముగ్గురు రాములు-పరశురాముడు, రఘురాముడు, బలరాముడు చేరినారు. కృష్ణుడును చేరినాడు. ఈ విధముగా అవతారాలనిర్ణయము ఇంకను ఏకరూపము దాల్చి యుండలేదు.

శ్రీమద్రామాయణములో రాముడు తాను విష్ణ్వవతారమను మాటను మరిచి పోయియుండెను. రావణునితో యుద్ధముచేయు సందర్భములో అతనికి దేవతలు ఈ విషయాన్ని జ్ఞాపకముచేసి పోయిరి. రామలక్ష్మణులు నాగపాశబద్ధులైనప్పుడు గరుత్మంతుడు దివ్యజ్ఞానముతో నీ సంగతిని గ్రహించి వెంటనే రణభూమికి వెళ్లి నాగపాశములనుండి రామలక్ష్మణసోదరులను విడిపించగా రాముడు తెలివినొంది "ఓయీ నీ వెవ్వరు"? అని

ప్రశ్నింపగా "నేను మీకు స్నేహితుడను" అని గరుత్మంతుడు చెప్పెను. రాముడు తన స్నేహితు నెట్లు మరచిపోయెను?

అప్పుడప్పుడు రాముడు మనిషివలెనే ఆచరించుటను వ్యాఖ్యాతలు సమన్వయించినారు. ఆవిధముగా అతడు నటన చేసెనట! అక్కడక్కడ రామాయణములో కొన్ని శ్లోకాలు అవతార నిరూపణకై చేర్చినారు. ఆదిలోనే బాలకాండలో విష్ణువు దేవతలతో నిట్లన్నాడు. "నేను రావణుని జంపి భూలోకములో ౧౧౦౦౦ ఏండ్లుందును. రావణునివధకై వచ్చిన యవతారము అపని పూర్తియైనతర్వాత ౧౧౦౦౦ ఏండ్లుండి ఏమిసాధించెను? దానికి కారణమేమియు తెలుపలేదు. శ్రీకృష్ణుడు ౧౧౬ ఏండ్లే జీవించెనని భారతమునుండియు ఛాందోగ్యోపనిషత్తునుండియు తెలియవచ్చుచున్నది. కాని రాముడు ౧౧౦౦౦ ఏండ్లు కారణము లేకుండా ఎందుకు జీవించెను? ఇట్టి యంశా లన్నియు తర్వాత చేర్చబడినట్టివే.

రామాయణమందు అందందు చైత్యములను గురించి వ్రాసినారు. అవి బౌద్ధాలయములే యని చెప్పజాలము. కాని సందేహానికి తావు లేనట్లుగా జాబాలి అనువాడు రామునితో శ్రాద్ధము పెట్టవలసిన అవసరములేదని వాదింపగా శ్రీరాము డాగ్రహించి యిట్లు పరుషోక్తుల నాడెను.

యథాహి చోర స్సతథాహి బుద్ధః, తథాగతం నాస్తిక మత్ర విద్ధి
తస్మాద్ధి య శ్శంక్యతమః ప్రజానాం, న నాస్తికే నాభిముఖో బుధ స్స్యాత్.
అయోధ్య. ౧౧౦ - ౩౪.

బుద్ధుడు (లేక తథాగతుడు) చోరుడు. అతనిమతము గర్హ్యము అని రాముడు తొమ్మిదవ అవతారాన్ని నిందించెను. బుద్ధుడు క్రీ॥ పూ॥ ౫౦౦ ప్రాంతమందలివాడు. అతని వేదవిరుద్ధమైన బౌద్ధమతము వ్యాప్తినొందిన తర్వాత దాని సిద్ధాంతములలోని శ్రాద్ధప్రతికూల్యతను రామునిద్వారా పౌరాణికులు ఖండింపజేసినారు. మరొకచోట,

"శ్రూయతే మనునా గీతా............ కిష్కింధ ౧౮-౩౧ నుండి 33 వరకు.

అని రెండు మనుస్మృతి శ్లోకాల నుదహరించినారు. రాముని వంశమం దాదిపురుషుడు మనువను వా డుండెను. ఈ యుదాహృతు డతడు కాడు. మనుస్మృతిలో ఈ యుదాహృత శ్లోకాలలో నొకటి కానవచ్చుచున్నది, కాన యీ మనువు స్మృతి కర్తయై యున్నాడు.

మరొకచోట —

పంచపంచనఖా భక్ష్యా బ్రహ్మక్షత్రేణ రాఘవ-కిష్కింధ ౧౭-౩౯

అను వాక్యము కలదు.

గౌతమ ధర్మ సూత్రములలో "పంచపంచనఖాభక్ష్యాః" అను సూత్రము కలదు. ఎవరు ముందు వ్రాసిరో తెలియదు. యుద్ధకాండములో రావణుని అమాత్యాదులు చనిపోగా కుంభకర్ణుని లేపుటకు ముందు రావణుడు తన సభ్యులతో ఇట్లనెను,

"ఇక్ష్వాకుకులనాథేన అనరణ్యేన యత్పురా"

యుద్ధ ౬౦-౮.

రావణుడు ఇక్ష్వాకువంశమందు పూర్వికుడైన అనరణ్యుడను రాజును జంపెను. అతడు చనిపోవుచు "ఓరీ, నా వంశమందు నిన్ను జంపువాడు పుట్టగలడు" అని శపించి పోయెనని అందు చెప్పబడినది. ఇది క్రొత్తవిషయము. ఇంతవరకు ఈ ముచ్చట ఎందును రాలేదు. ఈ అనరణ్యు డెవ్వడు? రామాయణబాలకాండలో ౭౦ వ సర్గలో ఇక్ష్వాకువంశ వృక్షమియ్యబడినది. అందు త్రిశంకుని తాత అనరణ్యుడని పేర్కొనబడినాడు. అట్టి అన రణ్యుడు రాముని కన్న ౨౮ తరాలకు ముందుండినవాడు. తరమునకు ౨౫ ఏండ్ల లెక్క పరికారము చూచిన అనరణ్యుడు రామునికంటె ౭౨౫ ఏండ్లకు ముందుండినవాడు. అయితే యీ లెక్క కలికాలపు లెక్క. కృతయుగములో దశరథుడే ౬౦౦౦౦ ఏండ్లు జీవించెను. మరి అతని పూర్వికులు ఒక్కరొక్క రెన్ని వేలయేండ్లు జీవించిరో యేమో? ఆలెక్క పరికారము చూచిన మన కేమియు అర్థము కానేరదు. రామునికన్న ౨౮ తర ములకు ముందుండిన అనరణ్యుని రావణుడు చంపినాడన్న రావణుని వయస్సెంత యుండ వలయునో గణిత శాస్త్రజ్ఞులును, జ్యోతిష్కులును, పౌరాణికులును, కలిసి లెక్కలు వేయు చుండవలసినదే!

జైనరామాయణములో ఇట్లు వ్రాసినారు. "విజయుడు అయోధ్య నేలుచుండెను. అతని తర్వాత ౨౭ గురు రాజ్యము చేసిరి. కడపటివాడగు అనరణ్యుడు రఘుమహారాజు కుమారుడు. అతనికి దశరథుడు పుట్టెను. దశరథునికి రామాదులు పుట్టిరి." దీనినిబట్టి అనరణ్యుడే అజమహారాజని తేలును. ఇది రామాయణ కథకన్న ఎక్కువగా విశ్వాస నీయమై యున్నది.

రాముడు చిన్నవాడుగా ఉండినప్పుడు రావణుడు రాముని తాతకాలమువాడుగా నుండెనని దీనివలన అర్థమగును. అయినను వృద్ధరావణునికి పరకాంతాకాంక్ష యెట్లు కలు గును? మొత్తానికీ విషయము ప్రక్షిప్తమని తోచుచున్నది.

దశరథుడు అశ్వమేధమును చేయించుటకు ఋశ్యశృంగుని పిలిపించెను. అతడెవ్వరై నది దశరథునికి తెలియదు. అందుచేత తనమంత్రి ఆతనికథను తానుగూడా ఎవరో పూర్వంలో చెప్పగావిని దశరథుని కెరిగించెను. ఋశ్యశృంగుడు తుదకు దశరథుని అల్లుడే! అల్లునిసంగతి మామకే తెలియకపోయెను పాపము! శాంతఅను కూతురు దశరథునికి ఉండె నట. ఆమె ఏ దేవేరికిపుట్టెనో యేమో జాడయే కానరాదు. దశరథుని కింతవరకు కుమా రులు జనింపలేదు. అట్టిస్థితిలోఉన్న యొక్కకూతురును ఎవడో అంగరాజట, అతనికి దత్తుగా ఇచ్చివేసెను. ఈ కథయంతయు కల్పితమే యని స్పష్టము.

రాముడు వనవాసమునకు వెళ్ళుచు కైకతో ఇట్లు శపథము చేసెను.

చతుర్దశహివర్షాణి వత్స్యామివిజనేవనే, మధుమూల ఫలైర్జీవన్ హిత్వాముని వదామిషం.

అయోధ్య ౨౦-౨౮

నేను ఈ ౧౪ ఏండ్లు మాంసముతినకుండ రామునివలె అరణ్యంలో ఉంటాను అని మాటయిచ్చి నాలుగైదుదినాలకే అరణ్యానికి పోయిన ఆదిలోనే ఆ శపథాన్ని మరచి పోయెనా? గంగను దాటి మొదటిదినమే అరణ్యావాసము చేసిననాడు నాలుగు పెద్ద మృగాలను చంపి తానును సీతయు లక్ష్మణుడును తినినారు.

"తౌ తత్ర హత్వా చతురో మహామృగాన్, వరాహ మృశ్యం పృషతం మహారురుం
ఆదాయ మేధ్యం త్వరితం బుభుక్షితౌ, వాసాయ కాలే యయతు ర్వనస్పతిం.

అయోధ్య ౫౦ - ౧౦౨

ఇంతేకాక ఇంచుమించు పది యిరువదితావులందు రామాదులు మాంసమును తిన్నట్లు వర్ణించినారు. హనుమంతుడు సీతతో ఇట్లన్నాడు. "రాముడు నీ వియోగదుఃఖముచే మద్యమాంసములను వదలివేసినాడు" (సుం. ౩౬-౪౧)

దీనినిబట్టి రామాదుల మాంసభక్షణమో లేక తద్వర్జనమో ఏదో యొక భాగము ప్రక్షిప్తమైనదనుట స్పష్టము.

హిందూస్థానములో లభ్యమైన వివిధప్రాంతాలలోని రామాయణ ప్రతులనుబట్టి కూడా మధ్యమధ్య యెవరికి తోచినట్లు వారు తమతమ హస్తలాఘవమును చూపినారు. "పశ్చిమహిందూస్థానములోను, బెంగాలులోను, బొంబాయిలోను, లభ్యమైన రామాయణ ప్రతులలో సరాసరి మూడవభాగము వరకు ఒకదానిలో నున్నట్లుగా ఇంకొకదానిలోలేదు" అని మెక్డానెల్ గారు వ్రాసినారు. రామాయణమును ఒక మహాకావ్యము క్రింద లెక్కపెట్టి దానిలో కావ్యరీతులను, వర్ణనలను, సరిగా ఉండునట్లు తీర్చి, భాషను కూడా చాలా సవరించి తర్వాత క్రమక్రమముగా పెంచుచు ఇప్పటి రూపానికి తెచ్చినట్లు కనబడుచున్నది. జెకోబీగారు రామాయణాంతరంగికపరీక్షను బాగుగాచేసి బాలకాండ యుత్తరకాండయు మొదట లేకుండెననియు, ౨ నుండి ౬ కాండలవరకే మొదట నుండెననియు తర్వాత బాలోత్తరకాండలను చేర్చి రామునికి విష్ణ్వవతార తత్త్వమును సిద్ధింపజేసిరనియు అభిప్రాయ మిచ్చినారు. ఈ విధముగా రామాయణము పెరుగుతూ వచ్చిన దనుటకు ఏమిన్ని సందేహము లేదు.

శ్రీరాముని కాలమందే రామాయణము సంస్కృత భాషలోనే మార్గవిధానముతో తందానకథగా తంత్రి మర్దలాది పరికరాల సహాయముతో గానము చేయబడుచుండెను. అట్టి కథాగానమును విశేషమైతే రెండు మూడు రాత్రులలో చేసియుందురు. సంస్కృతములో కథ చెప్పిన పామరులు దాని నర్థము చేసికొనియుండవలయును. మరియు వారును సంస్కృతమునే మాట్లాడి యుండవలయును. పాణినికన్న పూర్వము జను లందరు సంస్కృతమునే మాట్లాడుచుండిరి. అతని కాలమువరకు ప్రాకృతభాషలు సంస్కృతజన్యములై వ్యాప్తిలోనికి వచ్చుచుండెను. సంస్కృతము పామరవ్యవహారముచే అపభ్రంశమై దుష్టము కాకుండా రక్షింపవలసి యుండెను. పాణినికన్న పూర్వమే శాకల్యుడు, శాకటాయనుడు, మున్నగువారు సంస్కృతవ్యాకరణములను వ్రాసిరి. పాణిని క్రీ. పూ.

౨౦౦ తర్వాతివాడు. రామాయణములోని భాషకూడా చాలా ప్రాచీనమైనదిగా ఉండెను. అనగా రామాయణమం దంతటను ఇప్పుడుండుభాష పాణినికన్న పూర్వముదిగా కనబడదు. పాణిని సూత్రాలకు భిన్నమైన భాష అందందు కనబడుచున్నది. దానిని తప్పనుటకు వీలులేక ఆర్షము అని పెద్దలు నిర్ణయించిరి. ఇట్టి ఆర్షములు చాలావరకు దిద్దియుందురు. అక్కడికిని వీలులేని పదాలను అట్లే యుంచి వాటిని ఆర్షప్రయోగములక్రింద లెక్క కట్టివేసిరి. ఈ ఆర్షాలే రామాయణప్రాచీనతను పట్టించుచున్నవి.

## భాగవత ప్రమాణము

ఈ చర్చాభాగమును ముగించుటకు పూర్వము మరిరెండు నిదర్శనములను రామాయణ ప్రాచీనత కుదాహరణముగా నిరూపింతును. భాగవతమందు నవమస్కంధములో రామావతారమును వర్ణించి తర్వాత శ్రీరాముని వంశక్రమమును వర్ణించినారు. అందిట్లు వ్రాసినారు.

“రామచంద్రునకు కుశుండు, కుశునకు అతిథియు, అతిథికి నిషధుండును, నిషధునకు నభుండును............................శీఘ్రునకు మరవను రాజశ్రేష్ఠుడును పుట్టిరి...............విశ్వసాహ్వ్యునకు బృహద్బలుండును జనించిరి. ఆ బృహద్బలుడు భారతయుద్ధంబున మీతండ్రియగు అభిమన్యునిచేత హతుండయ్యె” అని చెప్పబడినది.

పరీక్షితుతో సూతుడు పై వాక్యాలను చెప్పినాడు. రాముని యనంతరము బృహద్బలుని వరకు రాముని వంశములో ౨౯ తరాలు గడిచెనని పై వంశావళిని బట్టి విశదమగును. తరానికి ౨౫ ఏండ్ల లెక్కప్రకారము గావించిన రాముని యనంతరము ౭౨౫ ఏండ్ల తర్వాత భారత యుద్ధము జరిగెనని నిర్ణయమగుచున్నది, ఈ లెక్కప్రకారము కూడా నే నూహించిన క్రీ॥ పూ॥ ౨౫౦౦ నాటి కాలము రామవాల్మీకులకాల మనియే చెప్పవలెను.

## విశ్వామిత్రుని కాలము

ఇదే సందర్భమును గురించి మరొక యుదాహరణము గూడా లభించుచున్నది. “హిందూస్థానచరిత్ర కాంగ్రెసు” సభకు ౧౯౩౯ లో అధ్యక్షత వహించిన అల్టేకర్ గారు తమ అధ్యక్షోపన్యాసములో ఇట్లొక అభిప్రాయమును వెల్లడించి యున్నారు.

“ఋగ్వేదములోని మూడవ మండలమునకు కర్తయయిన విశ్వామిత్ర మహర్షి కాన్యకుబ్జరాజవంశమునకు తుది పురుషుడు. అతడు తన క్షత్రియజాతిని వదలి ఒక బ్రాహ్మణవంశమునకు మూలపురుషు డయ్యెను. మహాభారత యుద్ధమునకు ౬౦ తరాలకు ముందు అతడుండెను. అనగా మహాభారతకాలానికంటె ఇంచుమించు ౯౦౦ ఏండ్లకు ముందుగా అతడుండెను. మహాభారతము కాలము క్రీ॥ పూ॥ ౧౪౦౦ కావున వాల్మీకి క్రీ॥ పూ॥ ౨౩౦౦ ఏండ్ల ప్రాంతమం దుండియుండును”

ఆల్టేకర్ గారి అభిప్రాయములో విశ్వామిత్రుడు క్రీ॥ పూ॥ ౨౩౦౦ నాటివాడు. అతడు శ్రీరామునికి ధనుర్గురువు. అందుచేత శ్రీరాముడును అదేకాలమువాడై యుండెను. ఈ ప్రకారముగా ఎన్నివిధాల చూచినను శ్రీరామచంద్రుని కాలము క్రీస్తునకు పూర్వము ౨౫౦౦ నాటిదనియే స్థిరపడుచున్నది.

ఈ విధముగా బౌద్ధమత ప్రారంభమువరకు రామాయణము పెరుగుచూవచ్చినది. బౌద్ధ మతవ్యాప్తిదశ క్రీ॥ పూ॥ ౫౦౦ కాలము. అయితే అటు తర్వాతికాలములోకూడా రామాయణమును పెంచి వ్రాయలేదా అని ప్రశ్నించిన లేదని చెప్పవచ్చును. ఎందు కనగా క్రీ॥ పూ॥ ౫౦౦ తర్వాతికాలపు ఆచారములుకాని, వృద్ధికివచ్చిన క్రొత్తనగరాల ప్రసక్తికాని, ఇతర చారిత్రిక నిదర్శనాలుకాని రామాయణములో కానరావు. బౌద్ధుల అహింసాబోధలు దేశమందింకను పట్టువడి యుండలేదు. మాంసభోజన నిషేధ మింకను హిందువులు శాసించి యుండలేదు. ఆ విధముగా శాసించియుండిన రామాయణ మందలి మార్పులను చేసినవారు సీతారామలక్ష్మణుల మాంసభోజనచర్చ ఎందెందు కలదో అదం తయు శుభ్రముగా తుడిచివేసి యుందురు.

(రామాయణములో ప్రక్షిప్తభాగా లేవేవి కలలో వాటినిగురించినచర్చ ఇంకను చేయదగినది కలదు. కాని బహుకాలమునకు పూర్వమే సి. వై. వైద్యాగారు తమ (Riddle of the Ramayana) అను ఆంగ్ల గ్రంథములో చేసినారు. నేను చూపినవికాక వారు మరికొన్ని పై గ్రంథములో వ్రాసినారు. కావున ఆచర్చను ఇంతటితో వదలినాను.

సారాంశ మేమనగా:

౧ శ్రీరామచంద్రుడు క్రీ॥ పూ॥ ౨౫౦౦ ప్రాంతమందుండెను.

౨. శ్రీరాముని సమకాలికుడే వాల్మీకి. అతడు రామాయణమును పాటగా వ్రాసి శిష్యులకు నేర్పించి ఊరూర, రాజసభలలో, ప్రచారము చేయించెను.

౩ రామాయణమును క్రీ॥ పూ॥ ౨౫౦౦ నుండి క్రీ॥ పూ॥ ౫౦౦ వరకు పెంచుచూ వచ్చిరి. అందు ముఖ్యముగా బాలకాండ, ఉత్తరకాండ ఇంచుమించు సంపూర్ణముగా తర్వాత పెంచబడినట్టివే.

౪

## ముఖ్య సంఘటనల కాలచర్చ

శ్రీ మద్రామాయణములో ముఖ్య సంఘటనలు ఎప్పు డెప్పుడు సంభవించెనో తెలుసుకొందము. మొట్టమొదట శ్రీరామచంద్ర సోదరుల జననకాలమును గురించి రామాయణ మేమి తెలుపుచున్నదో కనుగొందము. దశరథమహారాజు వృద్ధుడగుచు వచ్చెను. ముగ్గురిభార్యల పెండ్లాడియుండెను. వారు పట్టపురాణులు. _గా ౩౫౦ మంది స్త్రీలను వివాహమాడియుండెను. అయితే వారు స్వజాతిస్త్రీలుగా ఉండినట్లు కానరారు.

'అర్ధస ప్తశతా స్తాస్తు ప్రిమదాస్తామ్రిలోచనాః' అయో ౮౪ - ౧౩

ఇంతమంది భార్యలున్నను అతనికి సంతానము లేకపోయెను. సంతానార్థియై అశ్వమేధయాగ మొనరించెను. అటుతర్వాతనే ఆతని పట్టపురాణులైన కౌసల్య, సుమిత్రి, కైకేయీలకు రామలక్ష్మణ భరత శతృఘ్నులు పుట్టిరి. వారి జననకాలమునుగురించి రామాయణమం దిట్లు తెలిపినారు.

తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ
నక్షత్రేఽదితి దైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు
గ్రిహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతం
కౌసల్యా జనయ ద్రామం సర్వలక్షణ సంయుతం·

బాల ౧౮ - ౮, ౯, ౧౦.

అశ్వమేధ యాగమైన ౧౨ నెలల యనంతరము చైత్రిమాసమునందు (శుద్ధ) నవమీ తిథియందు పునర్వసూనక్షత్రమందు సూర్యాంగారక శని బృహస్పతి శుక్రు లైదుగురును తమతమ యుచ్చస్థానములగు మేష మకర తులా కర్కట మీనములందుండగా అందు బృహస్పతి చంద్రునితో చేరియుండగా కర్కటలగ్నమందు ఇక్ష్వాకువంశవర్ధనుడగు రాముని కౌసల్యాదేవి కనెను అని వ్యాఖ్యాతలు వ్యాఖ్యానించినారు.

ఈ యంశమునుగురించి శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఇట్లువ్రాసినారు.

"క్రీ॥ పూ॥ ౧౭౬౧ ఫిబ్రివరి ౯-వ తేదీనాడు రాముడు పుట్టినటుల రామాయణ జాతకముచే నిశ్చయించితినని ఇలియట్ అనువాడు వ్రాసెను॥ రామాయణ మందలి పై "తతశ్చద్వాదశేమాసే ఇత్యాది శ్లోకములు — పై పద్ధతి ప్రికారము ఎప్పుడును నేటి సిద్ధాంతముచే చైత్రి శు ౯ నాడు ఐదు గ్రిహము లుచ్చస్థితియం దుండవు, అట్లయిదు గ్రిహము లుచ్చస్థితియందుండినయెడల నవమినాడు పునర్వసూ నక్షత్రిము రాదు. ఫాల్గుణ బ ౩౦ నాటికి సూర్యుడు రేవతీ నక్షత్రాంత్యకలయందుండి చైత్రి శు ౧ నాడు మేషరాశి (అశ్వినీ నక్షత్రిము)లో ప్రవేశించినయెడల అమావాస్యనాడు రేవతీ నక్షత్రి మగును. శుద్ధ ౯ నాడు ఆశ్రేషా నక్షత్రిముకాని పునర్వసూనక్షత్రిము రాదు. ............చైత్రి శు ౯ ప్రాంతమున బుధు డెప్పుడును కుంభ మీన మేష వృషభ రాసుల మధ్యమందే సూర్యునికి వెనుకటి రాశిలోనో ముందటి రాశిలోనో యుండును. కాని స్వోచ్చస్థానమగు కన్యారాశిలో నుండడు*"

రామాయణమందు వాల్మీకి పలుతావుల జ్యోతిశ్శాస్త్ర విషయముల నుదహరించినాడు. మరి యచ్చట ఇంత విపులముగా వర్ణించి ఏల తప్పిపోయెను? ఇది ప్రిక్షిప్తమేనా! ఆధునికజ్యోతిష్కులు నిర్ణయింతురుగాక!

* ఆంధ్రి సాహిత్య పరిషత్పత్రిక. సంపుటము ౧౨, సంచికలు ౨-౩.

Regd. No. M. 4122. H. E. H. Nizam's 165.

"VIBHUTI" SECUNDERABAD Dn.

Editor:—PANDIT C. M. VEERABHADRA SHARMA.

## మ హా రా జ పో ష కు లు

| | |
|---|---|
| మ. బ్రి. శ్రీ ముమ్మడి సిద్ధశంభుస్వాములవారు | చేబ్రోలు |
| శ్రీ శ్రీ ఆదిలక్ష్మీ మ్మ దేవమ్మ మహారాణిగారు | గద్వాల సంస్థానము |
| ,, జి. హెచ్. వీరన్నగారు, గుబ్బి | బెంగుళూరు |
| ,, చుక్కా శనగల-కోటివీరయ్యగారు | కొర్రపాడు |
| ,, నేలపల్లి కోటయ్యగారు | దుగ్గిరాల |
| ,, రాచంశెట్టి కోటివీరయ్య, కొలగాని నాగయ్యగార్లు | ,, |
| ,, నాగూరు మల్లప్ప షావుకారుగారు | నంద్యాల |
| ,, ఆరాధ్యుల మూటయ్యగారు | చామర్లకోట |

## రా జ పో ష కు లు

| | |
|---|---|
| శ్రీ శ్రీ అందెల కోటివీరయ్యగారు | చేబ్రోలు |
| ,, అందెల కోటినాగయ్యగారు | ,, |
| ,, సిద్దాని అంకన్నగారు, మ్యు. కమీషనర్ | రాజమండ్రి |
| ,, శరణార్థి గౌరయ్యగారు, బి. ఎ., సబ్ రిజిష్ట్రార్ | పామర్రు |
| ,, ఈదర వేంకటరావుపంతులుగారు (వేంకటరాం అండ్ కో) | ఏలూరు |
| ,, కీ. శే. దేవిశెట్టి అమ్మన్నగారు | నిడదవోలు |
| ,, ధాళాధూళి వీరయ్యగారు | ,, |
| ,, రుద్రిశెట్టి గుండయ్యగారు | చెన్నూరు |
| ,, పెద్దశెట్టి శాంతయ్యగారు | ,, |
| ,, దుద్దాల బుచ్చప్పగారు | సదాశివపేట |
| ,, సాయం సిద్ధరామప్పగారు | శంషాబాదు |
| ,, డా. కె. రుద్రప్పగారు, ఎల్. ఎం. ఎస్. | హైదరాబాద్ |
| ,, ఏదుల రాజయ్యగారు | ,, |
| ,, దండె చిన వీరప్పగారు | గద్వాల |
| ,, మాడపు శంకరప్పగారు | సికిందరాబాదు |

## స హా య కు లు

| | |
|---|---|
| శ్రీ శ్రీ అవధూత బసవరాజుగారు, నూజివీడు | శ్రీ శ్రీ చుక్కా పాపయ్యగారు, వల్లభాపురం |
| ,, వే. బసవయ్యస్వామిగారు, శ్రీశైలము | ,, పాలకొల్లు చెన్నబసవయ్యగారు, కనగాల |
| ,, అవధూ[illegible]గాలయ్యగారు, రంగాపురం | ,, కుంచాల నాగయ్యగారు, ,, |
| ,, చ[illegible]య్యగారు, చిలువూరు | ,, కుంకులగుంట బసవయ్యగారు, నరసరావుపేట |
| ,, చదువు[illegible]శంకరయ్యగారు, నరసాపురం | ,, పట్నంశెట్టి మల్లప్పగారు, మెదక్ |
| ,, ఎస్. సోమేశ్వరరావుగారు, వికారాబాదు | ,, చిమిరాల చంద్రశేఖరయ్యగారు, దేవరపల్లి. |

Printed by K. L. Narasayya, at the Andhra Grandhalaya Press, Bezwada.